

# ఆంధ్ర రఘువంశము.



ఆదిపూడి సోమనాథరాయ

ప్రణీతము

పద్యకావ్యము

సంపూర్ణ సంస్కృత రఘువంశసమేతము

మొదటికూర్పు.



కాకినాడ:

స్కేప్ అండ్ కంపెనియందు

ముద్రితము.

౧౯౧౩

# పీఠిక

నిర్గతాసు న వా కస్య కాళిదాసస్య సూక్తిషు
ప్రీతిర్మధురసార్ద్రాసు మంజరీష్వివ జాయతే। † (బాణకవి.)

మహోన్నతదశ ననుభవించిన ప్రతిదేశమునకును లలామభూతుఁడైన యొక కవి యుండును. ఇతరకవులను గుఱించి దేశస్థు లెట్టియభిప్రాయభేదములు కలవారైనను ఆ కవిశేఖరుని యెడమాత్ర మనన్యసామాన్యగౌరవము కలవారలై యుందురు. ఆకవిపుంగవుని దివ్యవాణియే యాదేశమందలి వాఙ్మయవృక్షమునకు నాలవాలంబు. జనుల యున్నతభావాభివృద్ధికి నదియే ముఖ్యాధారంబు. ఇంతయేల? ఆదేశమందలి జనుల నిత్యకృత్యము లందును ఆకవిసార్వభౌముని ప్రతిభయే ప్రతిబింబితంబగుచుండును. గ్రీసుదేశపు హోమరు, ఇటలీవాఁడగు డ్యాంటి, ఇంగ్లీషువారి షేక్స్పియర్, మన కాళిదాసుఁడు మొదలగు మహనీయు లాయాదేశపుఁ గవిపుంగవులకుఁ గులగురువులై యున్నవారు. హోమర్ కవినిగూర్చి గ్రీకువా రపరిమితభక్తిప్రేరితులై ఏడు పట్టణములవారు 'అతఁడు మాపట్టణమునందే పుట్టె' నని హోరాహోరిగ వాదాడుచుండిరి. డ్యాంటే కవినిగుఱించి యిటాలియనులకు నభిమానము మెండు. షేక్స్పియరు విషయమై యింగ్లీషువారికిఁ గలభక్తి 'హిందూదేశమునైన వదులుకొందుముగాని షేక్స్పియరును వదల' మని యొకానొక పండితుఁడు చెప్పినమాటవలననే స్పష్టమగుచున్నది! మన దేశమగు భరతఖండంబునందంతటను వేలకొలఁది సంవత్సరములనుండియుఁ 'గవి కులగురుం' డనియుఁ, 'గవితా దేవికి విలాసం' బనియు * నసమానయశంబువడసినవాఁడు కాళిదాసుఁడు. ఈతఁడీఖండంబునఁ గాక ఖండాంతరంబులయందును రసికులచేఁ గవిశ్రేష్ఠుండని పొగడ్తగన్నవాఁడు ‡ కావున హిందూదేశముయొక్క జాతీయకవి కాళిదాసుఁడనియే చెప్పవలసియున్నది.

ఇట్లు కవిసార్వభౌముఁడైన కాళిదాసునికీర్తిదుందుభి యీదేశమునందు వేలకొలఁది సంవత్సరములనుండియు నెడతెగక మ్రోగుచున్నను మనవారికిఁగల చరిత్రవిషయకమైన యౌదాసీన్యమువలన, మనకు నీకవిశ్రేష్ఠుని గుఱించి యేమియుఁ దెలియదు. అప్పఁ

---

† తేనెతో మాగి యార్ద్రతఁ జెందినమంజరిఁ జూచిన నెట్టియానందము కలుగునో, కాళిదాసుని చక్కని కవిత్వము వినిన నట్టియానంద మేరికిఁ గలుగకుండును?

* 'కవి కులగురుః కాళిదాసోవిలాసః' అను జయదేవునివాక్యము సుప్రసిద్ధమే.

‡ శాకుంతలనాటకముఁ జూచి యానందముఁ బట్టలేక జార్మన్యాపండితుండగు గటీ నృత్యముచేసెనన్న జనవార్త యింగ్లీషుభాషాజ్ఞానము గలవారందఱు నెఱింగినదియే.

డేజాతివాఁడు? ఎచ్చటివాఁడు? ఏకాలపువాఁడు? అతని తలిదండ్రులెవ్వరు? అను ప్రశ్నములకు నిశ్చయాత్మకంబులయిన ప్రత్యుత్తరంబు లిచ్చుటకు నేమియు సాధనములు లేవు. పౌరస్త్యపాశ్చాత్యపండితులుకొందఱిందునుగుఱించి యిదమిత్థమని తేల్చుటకు వాఙ్మయంబునంతయుఁ బెక్కుతెఱంగులఁ బరిశోధించి చూచిరి. కాని యేదియు నిశ్చయముగఁ దెల్పఁజాలరైరి. కాళిదాసుఁడు సారస్వతుఁడని యొక్కఁడును, ఆంధ్రుఁడని మఱియొక్కఁడును; కాశ్మీరజుఁడని యొక్కఁడును, ఉజ్జయినీ నివాసుఁడని మఱియొక్కఁడును; విక్రమార్కుని కాలమువాఁడని యొక్కఁడును, భోజరాజ సమకాలికుఁడని మఱియొక్కఁడును, చెప్పుచుఁ బండితులు పలుపోకలఁ బోవుచున్నారు!

వేర్వేఱు వాదములన్నియుఁ జూడ శాకుంతల రఘువంశాది కావ్యకర్తయగు కాళిదాసుఁడు గౌడబ్రాహ్మణుఁడనియు, ఉజ్జయినీ నివాసుఁడనియు, ఆఱవ శతాబ్దమునందుండినవాఁడనియుఁ బెక్కుపండితుల యభిప్రాయమైయున్నట్లు కానవచ్చుచున్నది.

కాళిదాసునిచే రచింపఁబడిన కావ్యములు నాలుగు: రఘువంశము, కుమారసంభవము, మేఘసందేశము, ఋతుసంహారము; నాటకములు మూఁడు: శాకుంతలము, విక్రమోర్వశీయము, మాళవికాగ్నిమిత్రము. ఇవన్నియు గుమ్మడికాయయంతేసి ముత్యములే. కాని యిందును భేదముచేయవలయునన్న కావ్యములలో రఘువంశమును, నాటకములలో శాకుంతలమును ననుపమేయకావ్యసృష్టియని చెప్పవలసియున్నది.

ప్రస్తుతవిషయము రఘువంశము, దాని యాంధ్రీకరణము. ఇది గీర్వాణప్రౌఢప్రబంధములకు శిరోభూషణము. 'తేనెసోఁక నోరు తియ్యనయగురీతి' సాధారణవ్యుత్పత్తిజ్ఞానముగలవారికిని జక్కఁగనర్థమిచ్చు ద్రాక్షాపాకంబునకు సొగసైన తార్కాణంబు. ఇందు సూర్యవంశపు రాజపుంగవులవంశము పందొమ్మిది సర్గములలో వర్ణింపఁబడియున్నది. మొదటి పదునేడుసర్గములలో దిలీపుఁడు, రఘువు, అజుఁడు, దశరథుఁడు, రాముఁడు, కుశుఁడు, అతిథి యను రాజులవర్ణనంబును, పదునెనిమిదవసర్గమునందు నతిథివంశజులవర్ణనంబును, పందొమ్మిదవసర్గమునందుఁ జివరవాఁడైన యగ్నివర్ణుని శృంగారచేష్టావర్ణనంబును గలవు.

ఈమహాకావ్యమును ఇదివఱకుఁ దెనుఁగుచేసిన పూర్వకవి అవుసూరి కిచ్చయ్యా కాని యీతని భాషాంతరమునకును, శ్రీ సోమనాథరావుగారి యాంధ్రీకరణమునకును భేదముకలదు. కిచ్చయ మూలమును శబ్దశః తెలిఁగింపలేదు. మూలమందలి భావమును మనస్సునందిడుకొని దానిని దన యిష్టము వచ్చినశబ్దముల వర్ణించెను. శ్రీయుత సోమనాథరావుగారు, మూలమందలి శబ్దముతోడను, అర్థముతోడను భాషాంతరము తులఁదూఁగినట్లుండవలయు నన్నయుద్దేశముతోఁ దెలిఁగించియున్నవారు. అందుచే మూలమునందు లేని పదముగాని, భావముగాని వీరిభాషాంతరమునందు నుండదు. ఇట్లు భాషాంతరముచేయు

టనే యీయుభయకవులును వేఱుత్రోవలఁబోయిరి. సంస్కృతగ్రంథములను తెలిఁగించిన నన్నయ తిక్కనాది పూర్వకవులందఱును కిచ్చయ మార్గమునె యవలంబించియున్నారు. అనఁగా వారు మూలమునందలి కథను మాత్రము గైకొని స్వతంత్రకావ్యములను రచించిరి. వారియుద్దేశము స్వతంత్రకావ్యములను వ్రాయుట. ఇప్పుడు సోమనాథరావుగారు త్రొక్కినది నూతనమార్గము. ఇట్లు చేయుట ప్రతిపదార్థము చెప్పుటయే. గద్యమునందుఁ బ్రతిపదార్థము చెప్పుట సులభము గాని భావయుక్తమైన యర్థమునిచ్చునట్లు పద్యమునందుఁ జెప్పుట మిక్కిలి కష్టసాధ్యము. శ్రీ సోమనాథరావుగారు మూలమునందలి యొక్కొకపద్యములోని యర్థము తెలుఁగున నొక్కొకపద్యమునందు వర్ణించిరి. కిచ్చయ కవిత్వమునకును సోమనాథరావుగారి కవిత్వమునకును గలభేదము తెల్పుటకై యీక్రింది యుదాహరణముల నిచ్చుచున్నాఁడను:—

మూలము. సర్గ. ౧. శ్లో. ౩.

మందఃకవియశః ప్రార్థీ గమిష్యామ్యుపహాస్యతాం
ప్రాంశులభ్యే ఫలేలోభా దుద్బాహురివ వామనః॥

కిచ్చయ్య

ఉ॥ ఉన్నతమర్త్యలభ్యపద ◆ మొందెడువన స్మృతి నూర్ధ్వబాహుఁడై
యున్న సగర్వఖర్వమను ◆ జోత్తముకైవడి మందబుద్ధినై
కొన్న నరుండు సాధుకవి ◆ కుంజరకీర్తి గ్రహింప నెంచినన్
సన్నుతిచేయఁబోవుదురొ ◆ సత్కవులైన సమస్తభూజనుల్॥

సోమనాథరావుగారు

మందుఁడను నేను గవియశ◆మందఁగోరి। పరమపరిహాసమున కిలఁ◆బాత్రుఁడగుదుఁ
బొడుగువానికినందంగఁ ◆ బోలుఫలముఁ। బడయఁ గేలెత్తు నప్పొట్టి◆వానికరణి॥

మూలము. సర్గ. ౬. శ్లో. ౨౮.

అనేనపర్యాసయతాశ్రుబిందూన్। ముక్తాఫలస్థూలతమాన్స్తనేషు
ప్రత్యర్పితాః శత్రువిలాసినీనా। మున్ముచ్యసూత్రేణవినైవహారాః॥

కిచ్చయ్య

చ॥ పొలఁతిరో! విన్మ ముత్తియపుఁ ◆ బూసలఁబోలెడు బాష్పవారిబిం
దులఁ బరిపంథిధాత్రిపవ◆ధూస్తనపాళిని బ్రస్తరించు నీ
కవితమహారాజుఁడైన మహి◆కాంతుని చేత సమర్పితంబులై
యలరె గృహీతసూత్రకము◆లై తనుమౌక్తికతారహారముల్॥

సోమనాథరావుగారు

అశ్రుబిందులు ముత్తెమ్ము ◆ లంత లేసి । వైరికాంతలచనులపైఁ ◆ బ్రస్తరించి
యితఁడు మున్గొన్న సరులకుఁ ◆ బ్రతిగనిడిన । దారములులేనిదండల ◆ తీరుగొలిపె॥

మహానదీప్రవాహం బెచ్చటఁజూచినను కనులకు మనోహరంబుగఁ గానఁబడునట్లు ఈకావ్యమందలి ప్రతిసర్గమును, ప్రతిశ్లోకమును కవియొక్క యపూర్వప్రతిభను వెల్లడి చేయుచుఁ, జదువరులచిత్తవృత్తిని ఆకర్షించుకొనును. కావున నీకావ్యమునం దీభాగము బాగున్నది. ఈభాగము బాగులేదు, అని చెప్పుట యసాధ్యము. అయినను ౨ వ సర్గములోని సింహదిలీపుల సంవాదము. ౩ వ సర్గములోని ఇంద్రరఘువుల సంవాదము. ౬ వ సర్గములోని ఇందుమతీస్వయంవరము. ౭ వ సర్గములోని యుద్ధవర్ణనము. ౮ వ సర్గములోని అజునిశోకము. ౯ వ సర్గములోని వసంతర్తువర్ణనము. ౧౩ వ సర్గములోని పుష్పకారూఢుఁడైన రామునిచేఁజేయఁబడిన భూస్థలాదివర్ణనము. ౧౬ వ సర్గములోని స్త్రీరూపధారిణియైన అయోధ్యాపురికిని కుశునకును జరగిన సంవాదము. చివరసర్గమునందలి శృంగారవర్ణనము. అనునవి ఈకావ్యమను రత్నరాశిలోని కించిత్ స్థూలరత్నములు. ఈకథాభాగముల నెన్నిసారులు చదివినను తనివితీరదనియే నాయభిప్రాయము. కావున రఘువంశమును ఆంధ్రీకరించినకవి యీఘట్టముల నెట్లు తెనిఁగించెనో చూచినఁజాలును ఈవర్ణనములు రసవంతములుగనున్న కావ్యమంతయు రసవంతముగ నున్నదనియే యర్థము.

పైనివర్ణింపఁబడిన ప్రకరణములన్నియు శ్రీసోమనాథరావుగారి రఘువంశమునందు రసవంతములుగ వర్ణింపఁబడుటయె గాక జనసామాన్యమునకుఁగూడ సహజముగ నర్థమగునట్లు సులభశైలిని వ్రాయఁబడినవి.

ఇట్లు శ్రీయుతసోమనాథరావుగారు ఈమహాకవియొక్క మహాకావ్యమందలి యర్థమంతయు గీర్వాణభాష నెఱుఁగనివారుకూడ సులభముగఁ దెలిసికొనునట్లు తెనిఁగించి యాంధ్రలోకముయొక్క కృతజ్ఞతకుఁ బాత్రులైరని చూచుటకు వారిమిత్రుఁడను నేనెంతయు సంతసించుచున్నాఁడను.

కె. వి. లక్ష్మణరావు.



# ఉపోద్ఘాతము.



మత్పుత్రికారత్నంబగు శ్రీమతి మండువ శకుంతలాదేవి ౧౮౯౬ వ సం॥రము మే ౮ వ తేదీకి సరియగు దుర్ముఖినామసంవత్సర వైశాఖ బహుళ ౧౧ శుక్రవారమున నుద యించెను. అంత విద్యావంతురాలు కాకపోయినను సుగుణసంపదలో మాత్ర మేస్త్రీ రత్నమునకును దీసిపోక కనికరము, అడఁకువ, యోర్పు, పరిశుద్ధమైన ఋజువర్తన, దైవ భక్తి మొదలగు సుగుణములచే నొప్పారుచుండెను. ఈ సుగుణసౌందర్యరాశిని ౧౬ వ యేఁట అనఁగా ౧౯౧౧ వ సం॥రం జూన్ ౧౧ వ తేదీకి సరియయిన విరోధికృన్నామ సంవత్సర జ్యేష్ఠ శుద్ధపూర్ణిమా భానువాసరమున హైదరాబాదు ప్రాకారములోని మన్మి త్రులగు మ॥ శ్రీ దిట్టకవి లక్ష్మీనారాయణరావు పంతులుగారి తోఁటలోఁ జిత్రకళావిశా రదులగు మ॥ శ్రీ మండువ వేంకటరావు పంతులుగారికిచ్చి మత్పోషకులగు పిఠాపురమున గాలభూపతుల సహాయంబున యథావిధిగ వివాహంబు జరగింపఁ గలిగితిని. బంధువుల యొక్కయుఁ గొందఱు మిత్రులయొక్కయు నాదరణకు దూరముగావలసివచ్చినను సరకు గొనక కేవలము సుగుణసంపదనే వరియించి బీదరాలైన నాకుమార్తెను వివాహముచేసి కొన్నందులకై మ॥ శ్రీ వేంకటరావు పంతులుగారికి నేనెంతయుఁ గృతజ్ఞుఁడను.

వివాహానంతరము కొన్నిమాసములకు శకుంతలాదేవి జబ్బుపడినందున భార్యాభర్త లిరువురును పిఠాపురమునకు వచ్చి దసరా దీపావళులు దీరిన తరువాత వేంకటరావుగారు బొంబాయికి వెళ్లి ౪౦ రూపాయల వేతనముమీఁద నొక ఫొటోగ్రాఫిక్ కంపెనీలోఁ గుదురుకొని శకుంతలమ్మను బంపుమని వ్రాసిరి. ౧౯౧౨ వ సం॥ర ఫిబ్రవరి ౯ వ తేదీని స్వయముగా నేనే మాయమ్మాయిని దీసికొనివెళ్లి ౧౧ వ తేదీని బొంబాయిలో నామె భర్తగారి స్వాధీనముచేసి వచ్చితిని. అదే మార్చి ౧౦ వ తేది సాయంకాలము గదిలోఁ గూర్చుండి శ్రీమద్భాగవతములోని ప్రహ్లాదచరిత్రను జదువుచుండఁగాఁ బైవెలుఁగుచున్న దీపముయొక్క గాజుకుప్పె పగిలి యొకముక్క శకుంతలమ్మపైఁ బడెను. భయపడి తటాలున నెగురఁగా దీపము తలకుఁదగిలి యొడలిమీఁద నూనెతోఁగూడఁ బడి చీరెయుం తయు నొక్కసారిగ నంటుకొని భగ్గున మండఁజొచ్చెను. ఇంతలో వెలుపలనున్న భర్త పరువెత్తుకొనివచ్చి చేయిమూతులఁ గాల్చుకొని యెన్నియోవిధముల నార్పఁ బ్రయత్నిం చినను గార్యములేకపోయెను. శకుంతల తత్సమయమున భర్తనుగూర్చి మీరు చేతులను గాల్చుకొనకుఁడని యెన్నియోవిధముల వేఁడికొనెనఁట. ఇంతలో నిరుగుపొరుగులవారు వచ్చి కాలియున్న శకుంతల దేహముపై నీరుదెచ్చి పైచిరి. దానితో శరీరమంతయుం నిము సములో నుబ్బిపోయెను. తత్క్షణమే సమీపమందున్న తేజపాల్ వైద్యశాలకుఁ గొంపోఁ

ఖడెను. పోవునపుడు పరమేశ్వరునిగూర్చి 'పరమాత్మా! నాకెవ్వరును లేరు. నీవె తల్లివి. నీవె తండ్రివి' అని బిగ్గఱగా విలపించెనఁట.

ఇట్లు నాప్రియపుత్రిక బొంబాయి వైద్యశాలలో ౧౯౧౨ వ సం|| మార్చి ౧౧ వ తేదీకి సరియగు విరోధికృన్నామసంవత్సర ఫాల్గుణ బహుళ అష్టమీ సోమవారము రాత్రి ౭ గంటలకుఁ బరమేశ్వరుని పాదారవిందములఁ జేరికొనియెను. నేనును నాధర్మపత్నియు నపారమైన దుఃఖసాగరములో మునిఁగిపోయితిమి.

నన్నోదార్చుటకై యొకనాఁడు వసిష్ఠులవంటి బ్ర|| శ్రీ పురాణపండ మల్లయ్యశాస్త్రిగారు నాయింటికి విజయముచేసి పైనుండి పుష్పహారముపడి మృతినొందిన రఘువంశములోని యిందుమతీదేవియొక్క చరిత్రను దెలిపి నన్నూరడించిరి. అప్పుడే నాచేతనైనట్లు రఘువంశమును దెనిఁగించి మాయమ్మాయికి నంకితమొనర్పవలెననెడికోరిక నాకు జనియించెను. ఏప్రల్ ౧౦ వ తేదీనాఁడు ప్రారంభించి మధ్య నెన్నియంతరాయములు తటస్థించినను బరమేశ్వరుని సంపూర్ణానుగ్రహముచే అక్టోబరు 26 వ తేదీనాటికి ముగింపఁగలిగితిని. నాకుఁ గలిగిన కొన్నిసందేహములనుగూడ బ్ర|| శ్రీ మల్లయ్యశాస్త్రిగారే నివారించుచు వచ్చిరి. బ్ర|| శ్రీ పేరి పేరయ్యశాస్త్రిగారు మిక్కిలి యోపికతో ౧౦ సర్గలను బరిశీలించిరి. బ్ర|| శ్రీ శృంగారకవి సర్వారాయఁడుగారు దీనిని అవ్యాజవాత్సల్యముతో నామూలాగ్రముగఁ బరికించి యచ్చుతప్పులనుగూడ దిద్ది నాకు మహోపకారమొనర్చిరి. నాశ్రేయస్సునే యెప్పుడునుగోరు మన్మిత్రులగు మ|| శ్రీ కే. వి. లక్ష్మణరావు పంతులు ఎం. ఏ. గారు ఎన్నియో గొప్పకార్యములుండినను గూడఁ దీరికచేసికొని దీనికిఁ బీఠికను వ్రాసిరి. శోకసమయమున నన్నెందఱో మిత్రులు పరామర్శించిరి. ఎందఱో స్నేహితులు నేను 'దేహీ' యని చేయిచాపఁగానే ధనమునొసంగి యీపుస్తకము వెలువడునట్లు చేసిరి. స్కేవ్ అండ్ కంపెనీవారు తమచేతనైనంత చవుకగను జక్కఁగను శీఘ్రముగను దీని నచ్చొత్తించిరి. వీరి కందఱికిని నాకృతజ్ఞతాపూర్వక వందనముల హృదయపూర్వకముగా సమర్పించుచున్నాఁడను. మా శకుంతలమ్మను ఈపుస్తకరూపముగాఁ జిరకాలము జీవింపఁజేయుటకుఁ బరమకరుణాళువగు పరమేశ్వరునిం బ్రార్థించుచు నింతటితో విరమించుచున్నాఁడను.

ఇట్లు విన్నవించు
సజ్జనసేవకుఁడు,
ఆదిపూడి సోమనాథరావు.

పిఠాపురము,
౨౦ మార్చి ౧౯౧౩

# అంకితము.

గీ. శ్రీకరుని దుఃఖహరుని లో♦కైకగురునిఁ
గవివరమనోంబుజాతభా♦స్కరునిఁ గొలిచి
కాళిదాసుని రఘువంశ♦కావ్యమునకుఁ
దెనుఁగుఁగావించి నానేర్చు ♦ తీరునందు. ౧

గీ. ఇందుమతివలె మరణము ♦ నందినట్టి
విమలగుణమణిఖని యయి ♦ వెలిఁగినట్టి
సుతశకుంతలకిడితి నం♦కితముగాఁగఁ
దనరుగాకిది యాచంద్ర ♦ తారకముగ. ౨



శ్రీ

# రఘువంశమ్

## ప్రథమః సర్గః.

---:o:---

వాగర్థావివసంపృక్తౌ । వాగర్థప్రతిపత్తయే
జగతః పితరౌ వందే । పార్వతీ పరమేశ్వరౌ॥ ౧

క్వసూర్యప్రభవో వంశః । క్వచాల్ప విషయా మతిః
తితీర్షుర్దుస్తరంమోహా । దుడుపేనాస్మిసాగరం॥ ౨

మందఃకవియశఃప్రార్థీ । గమిష్యామ్యుపహాస్యతాం
ప్రాంశులభ్యేఫలేలోభా । దుద్బాహురివవామనః॥ ౩

అథవాకృతవాగ్ద్వారే । వంశేస్మిన్పూర్వసూరిభిః
మణౌవజ్రసముత్కీర్ణే । సూత్రస్యేవాస్తిమేగతిః॥ ౪

సోహమాజన్మశుద్ధానా । మాఫలోదయకర్మణాం
ఆసముద్రక్షితీశానా । మానాకరథవర్త్మనాం॥ ౫

యథావిధిహుతాగ్నీనాం । యథాకామార్చితార్థినాం
యథాపరాధదండానాం । యథాకాలప్రబోధినాం॥ ౬

త్యాగాయసంభృతార్థానాం । సత్యాయమితభాషిణాం
యశసేవిజిగీషూణాం । ప్రజాయైగృహమేధినాం॥ ౭

శైశవేభ్యస్తవిద్యానాం । యౌవనే విషయైషిణాం
వార్ధకేమునివృత్తీనాం । యోగేనాంతేతనుత్యజాం॥ ౮

రఘూణామన్వయంవక్ష్యే । తనువాగ్విభవోపిసన్
తద్గుణైః కర్ణమాగత్య । చాపలాయప్రచోదితః॥ ౯



శ్రీ

# రఘువంశము.

## ప్రథమాశ్వాసము.

### గీతములు.

వాక్కు నర్థంబు గలసిన ♦ పగిదిఁ గలసి । యఖిలజగములతలిదండ్రు ♦ లయినయట్టి
పార్వతీపరమేశుల ♦ భక్తిఁ గొలుతు । నమలవాగర్థ విజ్ఞాన ♦ మమరుకొఱకు. ౧

అల్పమానాదుమతి యేడ ♦ యతులమైన । సూర్యవంశచరిత్రంపు ♦ సుద్ది యేడ
తెలివితక్కువచేఁ జిన్న ♦ తెప్పనెక్కి । దాఁటఁగోరితి నౌర దు ♦ స్తరపుజలధి॥ ౨

మందుఁడను నేను గవియశ ♦ మందఁగోరి । పరమపరిహాసమున కిలఁ ♦ బాత్రుఁడగుదుఁ
బొడుగువానికి నందంగఁ ♦ బోలుఫలము । బడయఁ గేలెత్తు నప్పొట్టి ♦ వానికరణి॥ ౩

కాని యీవంశమునఁ బూర్వ ♦ కవివిచిత్ర ♦ వాగ్రచితమైన ద్వారంబు ♦ వఱలుఁగాదె
వజ్రకృతరత్నరంధ్రింబుఁ ♦ బట్టిపోవు । దారమునుబోలెఁ బోయెద ♦ దానిఁబట్టి॥ ౪

జన్మమాదిగ శుద్ధులై ♦ చనుచునుండ్రు । ఫలములగుదాఁకఁ గార్యముల్ ♦ సలుపుచుండ్రు
జలధివఱకున్న ధరనేలి ♦ చెలఁగుచుండ్రు । నాకపర్యంతరథమార్గ ♦ మమరియుండ్రు॥

విధివిహితమైనయట్టి స ♦ ద్విధినివేల్చి । తగిన కామితములనర్థి ♦ తతులఁ దనిపి
తప్పులకునెల్ల సరియైన ♦ దండమొసఁగి । సమయవిస్ఫూర్తి సతతంబు ♦ సంచరింత్రు॥

కడుధనమ్ము గడింత్రు త్యా ♦ గమ్ముకొఱకు । నతిమితమ్ము వచింత్రు స ♦ త్యమ్ముకొఱకు
గెల్వఁగోరుచునుందురు ♦ కీర్తికొఱకుఁ । గాంతురు గృహస్థధర్మమ్ము ♦ సంతుకొఱకు॥ ౭

అఖిలవిద్యలు బాల్యాన ♦ నభ్యసించి । యౌవనంబున విషయసౌ ♦ ఖ్యములఁ గాంచి
ముదిమిగదిసిన మునివృత్తిఁ ♦ బొదలుచుండి । యంతమున యోగులగుచు దే ♦ హముత్యజింత్రు॥

ఇట్టి రఘువంశవీరుల ♦ యుద్ధచరిత । నుడివెదను వాక్చమత్కృతి ♦ న్యూనమైనఁ
గర్ణములఁజేరి తద్గుణ ♦ గణమునాకు । గొప్పచాపల్యమును బురి ♦ కొల్పెఁగాన॥ ౯

# ప్రథమః సర్గః

తంసంతః శ్రోతుమర్హంతి । సదసద్వ్యక్తిహేతవః
హేమ్నః సంలక్ష్యతేహ్యగ్నౌ । విశుద్ధిః శ్యామికాపివా॥

వైవస్వతో మనుర్నామ । మాననీయోమనీషిణాం
ఆసీన్మహీక్షితామాద్యః । ప్రణవశ్ఛందసామివ॥

తదన్వయే శుద్ధిమతి । ప్రసూతే శుద్ధిమత్తరః
దిలీపఇతిరాజేందు । రిందుః క్షీరనిధావివ॥

వ్యూఢోరస్కోవృషస్కంధః । సాలప్రాంశుర్మహాభుజః
ఆత్మకర్మక్షమందేహం । క్షాత్రోధర్మ ఇవాశ్రితః॥

సర్వాతిరిక్తసారేణ । సర్వతేజోభిభావినా
స్థితః సర్వోన్నతేనోర్వీం । క్రాన్త్వామేరురివాత్మనా॥

ఆకార సదృశప్రజ్ఞః । ప్రజ్ఞయాసదృశాగమః
ఆగమైః సదృశారంభ । ఆరంభ సదృశోదయః॥

భీమకాంతైర్నృపగుణైః । సబభూవోపజీవినాం
అధృష్యశ్చాభిగమ్యశ్చ । యాదోరత్నైరివార్ణవః
రేఖామాత్రిదపిక్షుణ్ణా । దామనోర్వర్త్మనః పరం
నవ్యతీయుః ప్రజాస్తస్య । నియంతుర్నేమి వృత్తయః॥

ప్రజానామేవ భూత్యర్థం । సతాభ్యోబలిమగ్రహీత్
సహస్రగుణముత్స్రష్టు । మాదత్తే హిరసంరవిః॥

సేనాపరిచ్ఛదస్తస్య । ద్వయమేవార్థసాధనం
శాస్త్రేష్వకుంఠితాబుద్ధి । ర్మౌర్వీధనుషిచాతతా॥

తస్యసంవృతమంత్రస్య । గూఢాకారేంగితస్యచ
ఫలానుమేయాః ప్రారంభాః । సంస్కారాః ప్రాక్తనాఇవ॥

జుగోపాత్మానమత్రస్తో । భేజేధర్మమనాతురః
అగృధ్నురాదదేసోర్థ । మసక్తః సుఖమన్వభూత్॥

జ్ఞానేమౌనం క్షమాశక్తౌ । త్యాగేశ్లాఘావిపర్యయః
గుణాగుణానుబంధిత్వా । త్తస్యసప్రసవాఇవ॥

పైఁడినిగ్గులమో కాదో ◆ వహ్నియందే । యరయఁదగి యుండునట్టులే ◆ యార్యులెన్నఁ
దప్పులొప్పుల నరయఁగాఁ ◆ దగినవారు । గాన వారలె పరికింత్రు ◆ గాకదీని॥ ౧౦

వేదములకెట్టు లోంకార ◆ మాదియగునో । యట్లె ధరణీశులకునెల్ల ◆ నాదియగుచుఁ
దనరె వైవస్వతుండను ◆ మనువుపుట్టి । బుధజనావళికెల్లను ◆ బూజ్యుఁడగుచు॥ ౧౧

అతనిపరిశుద్ధవంశాన ◆ నవతరించెఁ । బరమపావనుఁడగు దిలీ◆ప ప్రభుండు
రాజచంద్రుండు చంద్రుండు ◆ తేజమొప్ప । క్షీరవార్నిధిఁబుట్టిన ◆ చెన్నుదోఁప॥ ౧౨

ఆనృపస్కంధ మురమెన్న ◆ నతివిశాల । మమ్మహాభుజుదీర్ఘ దే◆హమ్ముచూడ
సాలవృక్షాభ మాతఁడో ◆ స్వకీయార్హ । తనువుఁబాలించిపొల్చు క్షా◆త్రముదలంప॥ ౧౩

సర్వమునుమించి శక్తి తే◆జములచేత । విక్రమంబున నుర్వర ◆ నాక్రమించి
మించెనానృపు దేహంబు ◆ మేరువట్లు । లుర్వి సర్వోన్నతంబయి ◆ యొప్పుచుండి॥ ౧౪

అతని మూర్తికిఁదగియుండు ◆ నతనిప్రజ్ఞ । యతని ప్రజ్ఞకుఁదగియుండు ◆ నతనివిద్య
యతని విద్యకుఁదగియుండు ◆ నతనిపనులు । అతనిపనులకు ఫలములు ◆ నట్లెయుండు॥ ౧౫

గమ్యుఁడు నగమ్యుఁడైయొప్పె ◆ సౌమ్యభీమ । రాజగుణముల నాశ్రిత◆రాజి కతఁడు
రత్నములఁ గ్రూరజలచర ◆ వ్రాతములను । రాజిలుచునుండు నామహా◆ర్ణవముకరణి॥ ౧౬

మనువునుండియు నలిగిన ◆ మార్గమందు । నొక్కగీఁతయు దాఁటక ◆ యుర్విపాలు
ప్రజలు నడచుచునుందురు ◆ రథనియంత । నేర్పుమీఱఁగ నడపిన ◆ నేమిగతిని॥ ౧౭

ప్రజలయభివృద్ధియే దృష్టి ◆ పథమునందు । నునిచి యారాజు పన్నులఁ ◆ గొనుచునుండు
వేయి మడుఁగుల నియ్యఁగా ◆ వేఁడివెలుఁగు । కోరియేకాదె రసమును ◆ గొనుచునుండు॥

అతని పరికరమెన్నఁగా ◆ నతని బలమె । యర్థసాధకములు రెండె ◆ యతని కవని
శాస్త్రములఁజొచ్చి చెదరని ◆ సారబుద్ధి । యతులమైవింట నొప్పెడు ◆ నల్లెత్రాడు॥

గుప్తమైన విచారమ్ము ◆ గూఢమైన । హావభావముఁగల యట్టి ◆ యానృపాలు
కార్యజాతమ్ము పూర్వ సం◆స్కారమట్లు । ఫలముచేతనె యూహింప ◆ నలసియుండు॥

భయములేకయె తన్నుఁ గా◆పాడికొనియె । నాతురములేకయే ధర్మ ◆ మాచరించె
నాసలేకయె గ్రహియించె ◆ నర్థములను । సక్తిలేకయె భోగించె ◆ సౌఖ్యములను॥ ౨౧

జ్ఞానమం దొప్పె మౌనంబు ◆ శక్తియందు । క్షమయుఁ ద్యాగంబునందు శ్లా◆ఘావిరక్తి
యతనిలోఁ దలనిట్లు గు◆ణాళి గలసి । తనరుచుండెను మిగుల సో◆దరులపగిది॥ ౨౨

అనాకృష్టస్యవిషయై । ర్విద్యానాం పారదృశ్వనః
తస్యధర్మరతేరాసీ । ద్వృద్ధత్వంజరసావినా॥ ౨౩

ప్రజానాం వినయాధానా । ద్రక్షణాద్భరణాదపి
సపితాపితరస్తాసాం । కేవలం జన్మహేతవః॥ ౨౪

స్థిత్యైదండయతోదండ్యాన్ । పరిణేతుః ప్రసూతయే
అప్యర్థకామౌతస్యాస్తాం । ధర్మఏవమనీషిణః॥ ౨౫

దుదోహగాం సయజ్ఞాయ । సస్యాయమఘవాదివం
సంపద్వినిమయేనోభౌ । దధతుర్భువనద్వయం॥ ౨౬

నకిలానుయయుస్తస్య । రాజానోరక్షితుర్యశః
వ్యావృత్తాయత్పరస్వేభ్యః । శ్రుతౌతస్కరతాస్థితా॥ ౨౭

ద్వేష్యోపిసమ్మతఃశిష్ట । స్తస్యార్తస్యయథౌషధం
త్యాజ్యోదుష్టః ప్రియోప్యాసీ । దంగుళీవోరగక్షతా॥ ౨౮

తంవేధావిదధేనూనం । మహాభూతసమాధినా
తథాహిసర్వేతస్యాసన్ । పరార్థైకఫలాగుణాః॥ ౨౯

సవేలావప్రవలయాం । పరిఖీకృతసాగరాం
అనన్యశాసనాముర్వీం । శశాసైకపురీమివ॥ ౩౦

తస్యదాక్షిణ్యరూఢేన । నామ్నామగధవంశజా
పత్నీసుదక్షిణేత్యాసీ । దధ్వరస్యేవదక్షిణా॥ ౩౧

కళత్రవంతమాత్మాన । మవరోధేమహత్యపి
తయామేనేమనస్విన్యా । లక్ష్మ్యాచవసుధాధిపః॥ ౩౨

తస్యామాత్మానురూపాయా । మాత్మజన్మసముత్సుకః
విలంబితఫలైఃకాలం । సనినాయమనోరథైః॥ ౩౩

సంతానార్థాయవిధయే । స్వభుజాదవతారితా
తేనధూర్జగతోగుర్వీ । సచివేషునిచిక్షిపే॥ ౩౪

అథాభ్యర్చ్యవిధాతారం । ప్రయతౌపుత్రకామ్యయా
తౌదంపతీవశిష్ఠస్య । గురోర్జగ్మతురాశ్రమం॥ ౩౫

ఇంద్రియమ్ముల నానృపుఁ ♦ డీడ్వఁబడక । యతుల విద్యావిశారదుఁ ♦ డగుచుఁ వెలిఁగి
ధర్మరతుఁడౌట నతని స్పృ♦ధ్యామొందె । జరనుగల్గెడు వికృతి లే♦శమ్ము లేక॥ ౨౩

జనులరక్షించి పోషించి ♦ సంస్కరించి । యెంతయునుదయ నాదరా ♦ కాంతుఁడేలి
వాస్తవంబగు తండ్రిగాఁ ♦ బరిణమింప । జన్మమునకునుమాత్రమే ♦ జనకులైరి॥ ౨౪

అమలశీలుఁడు విద్వాంసుఁ ♦ డక్షభుండు । స్థితికి శిక్షార్హులౌవారి ♦ శిక్షసేయ
బిడ్డలను గాంచఁగాఁగోరి ♦ పెండ్లియాడ । నర్థకామమ్ములతని ధ♦ర్మాత్మ్యుఁజేసె॥ ౨౫

అవనిపతియజ్ఞమునకయి ♦ యవనిఁ బిదికె । దేవపతి సస్యములకయి ♦ దివిని బిదికె
నిరువురిట్టులు తమతమ ♦ సిరులమార్చి । పోషణమొనర్చుచుండిరి భువిని ♦ దివిని. ౨౬

ప్రజలరక్షించునాతని ♦ భవ్యయశముఁ । బరధరాధిపు లనుకరిం♦పంగఁగలరె
పరధనమునుండి విడివడి ♦ సరగవచ్చి । తస్కరత్వంబుశ్రుతిలోనె ♦ తగులువడియె॥ ౨౭

ఆర్తునకు నౌషధంబట్టు ♦ లతనికెపుడు । శత్రువైనను శిష్టుండు ♦ సమ్మతుండు
పాముకఱచిన వ్రేలట్లు ♦ పరమమిత్రుఁ । డైనఁ ద్యాజ్యుండు దుష్టుఁడౌ ♦ మానవుండు॥ ౨౮

ఆమహాభూతములదేన ♦ నావిధాత । చేసెనో దానిచేతనే ♦ చేసెనతనిఁ
గాకయుండిన నాపరా♦ర్థైకఫలమె । యతని సర్వగుణమ్ముల ♦ నట్టులున్నె॥ ౨౯

ప్రబలమహార్థి పరిఖయై ♦ పరిధవోల్ల । వేలచుట్టును జలధియై ♦ వేడ్కనింప
నన్యశాసనమింతయు ♦ నందనట్టి । ధరణి నేలెను దానొక్క ♦ పురముఁబోలె॥ 30

శుద్ధదాక్షిణ్య సుగుణ ప్ర♦సిద్ధురాలు । మగధవంశానఁ బుట్టిన ♦ మాన్యురాలు
యజ్ఞదక్షిణకరణి వి♦ఖ్యాతురాలు । పరసుదక్షిణ యాతని♦పత్నియయ్యె॥ 3౧

అంతిపురమున నెందఱో ♦ యతివలున్న । నామనస్విని తనపత్ని ♦ యగుటవలనఁ
గోరి సామ్రాజ్యలక్ష్మిఁ గై ♦ కొనుటవలనఁ । దన్ను సుకళత్రినంతుఁగఁ♦దలఁచెనతఁడు॥ 3౨

ఆమెలోఁ దన్నుఁబోలిన ♦ యాత్మజన్ముఁ । బడయఁగాఁగోరి వాంఛిత ♦ ఫలముగనక
దీర్ఘమౌ కాలమునుబుచ్చె ♦ దేవియిపుడొ । యపుడొ గర్భిణియగునను♦నాసతోడ॥ 33

సంతతికినైన విధులను ♦ సలుపు కొఱకుఁ । దన భుజమ్ములనుండిన ♦ ధరణిభార
మెల్లమెల్లన డించియా ♦ నృపవరుండు । చక్కఁగానుంచె సారసి♦సచివులందు॥ 3౪

ఆపవిత్రులు దంపతు ♦ లంతభక్తి । బ్రహ్మనర్చించి పుత్రునిఁ ♦ బడయనెంచి
గురుఁడగువసిష్ఠుఁజూచెడు ♦ కోర్కెమీఱ । నతని యాశ్రమమునుగూర్చి ♦ యరిగిరపుడు॥

## ప్ర థ మః స ర్గః.

స్నిగ్ధగంభీరనిర్ఘోష । మేకంస్యందనమాస్థితౌ
ప్రావృషేణ్యంపయోవాహం । విద్యుదైరావతావివ॥ ౩౬

మాభూదాశ్రమపీడేతి । పరిమేయపురస్సరౌ
అనుభావవిశేషాత్తు । సేనాపరివృతావివ॥ ౩౭

సేవ్యమానౌసుఖస్పర్శైః । సాలనిర్యాసగంధిభిః
పుష్పరేణూత్కిరైర్వాతై । రాధూతవనరాజిభిః॥ ౩౮

మనోభిరామాః శృణ్వంతౌ । రథనేమిస్వనోన్ముఖైః
షడ్జసంవాదినీఃకేకా । ద్విధాభిన్నాః శిఖండిభిః॥ ౩౯

పరస్పరాక్షిసాదృశ్య । మదూరోజ్ఝితవర్త్మసు
మృగద్వంద్వేషుపశ్యంతౌ । స్యందనాబద్ధదృష్టిషు॥ ౪౦

శ్రేణీబంధాద్వితన్వద్భి । రస్తంభాంతోరణస్రజం
సారసైఃకలనిర్హ్రాదైః । క్వచిదున్నమితాననౌ॥ ౪౧

పవనస్యానుకూలత్వాత్ । ప్రార్థనాసిద్ధిశంసినః
రజోభిస్తురగోత్కీర్ణై । రస్పృష్టాలకవేష్టనౌ॥ ౪౨

సరసీష్వరవిందానాం । వీచివిక్షోభశీతలం
ఆమోదముపజిఘ్రంతౌ । స్వనిఃశ్వాసానుకారిణం॥ ౪౩

గ్రామేష్వాత్మవిసృష్టేషు । యూపచిహ్నేషుయజ్వనాం
అమోఘాః ప్రతిగృహ్ణంతా । వర్ఘ్యానుపదమాశిషః॥ ౪౪

హైయంగవీనమాదాయ । ఘోషవృద్ధానుపస్థితాన్॥
నామధేయానిపృచ్ఛంతౌ । వన్యానాం మార్గశాఖినాం॥ ౪౫

కాప్యభిఖ్యాతయోరాసీ । ద్వ్రజతోఃశుద్ధవేషయోః
హిమనిర్ముక్తయోర్యోగే । చిత్రాచంద్రమసోరివ॥ ౪౬

తత్తద్భూమిపతిఃపత్న్యై । దర్శయన్ప్రియదర్శనః
అపిలంఘితమధ్వానం । బుబుధేనబుధోపమః॥ ౪౭

సదుష్ప్రాపయశాఃప్రాప । దాశ్రమంశ్రాంతవాహనః
సాయంసంయమినస్తస్య । మహర్షేర్మహిషీసఖః॥ ౪౮

మధురగంభీరనినదస♦మ్మానితంబు । స్యందనం బెక్కి వారున్న ♦ యప్పుడుచూడ
వర్షమేఘముమీఁదను ♦ వఱలుచుండు । విద్యుదైరావతమ్ముల ♦ విధముదోఁచె॥ ౩౬

పీఠ యాశ్రమములకిడఁ ♦ గూడదనుచు । నుచితపరివారమే వెంట ♦ నునిచికొనిన
వారి మహనీయతరనుప్ర♦భావగరిమ । నెంతయో సేన యున్నటు ♦ లింపునింపె॥ ౩౭

సాలవృక్షాళిలోపలి ♦ సౌరభమును । దాల్చి వనరాజి నిటునటు ♦ వాల్చివాల్చి
పుష్పాళినిగూడి చల్లఁగాఁ♦బొదలి మెదలు । మందమారుతమున సేవ్య ♦ మానులైరి॥ ౩౮

నేమిశబ్దోన్ముఖంబులై ♦ నెమ్మలంత । స్వాంతముప్పొంగు షడ్జము ♦ స్వరముచేత
రెండువిధములఁ గూయఁగా ♦ నిండువేడ్క । వినిరివారలు వీనుల ♦ విందుగాఁగ॥ ౩౯

దృష్టిసారించి సారించి ♦ తేఱివంకఁ । గొంతదూరమ్మునందుండి ♦ వింతవింత
చూచు మృగమిథునమ్ముల ♦ చూడ్కులందు । నంచితాన్యోన్యదృష్టి సా♦మ్యంబుఁగనిరి॥

స్తంభములులేని తోరణ ♦ స్రజమువోలెఁ । జాలుగాఁదీఱి మధుర ని♦స్వనముఁ జేసి
పోదలు సారసపక్షుల ♦ పోల్కివారు । మోము లఱయెత్తి చూచి స♦మ్మోదముఁగనిరి॥

కోర్కి సిద్ధించుననియెడు ♦ గురుతుగాఁగఁ । బవనుఁడనుకూలముగ వీచి ♦ పరఁగుకతన
నశ్వరింఖాసముద్భూత ♦ మైనరజము । ముంగురుల వేష్టనమ్మును ♦ ముట్టదయ్యె॥ ౪౨

అలలచేఁ గల్గుశైత్యమ్ము ♦ నలవరించి । హారియాతమనిశ్వాస ♦ మనుకరించు
సరసిలోపలి యరవింద ♦ సౌరభమును । నాసికానందముగఁ గ్రోలి ♦ రాసతీశు॥ ౪౩

అమలమా యూపచిహ్నాళి ♦ నలరుచుండి । మున్నుఁ దమచేతనీఁబడి ♦ చెన్నుమీఱు
గ్రామముల యాజికులువచ్చి ♦ ప్రేమనిచ్చు । నర్ఘ్యములతోడి దీవెన ♦ లందికొనిరి॥

అపుడుకాచిన కమ్మని ♦ యావునెయ్యి । గోపవృద్ధులు గొనిరాఁగఁ ♦ గూర్మి నెఱపి
మార్గముననున్న తరుల నా♦మములనెల్ల । నడిగి తెలియుచు నరిగె నా ♦ యవనివిభుఁడు॥ ౪౫

♦ శిశిరమునుదాఁటి చంద్రుండు ♦ చిత్తతోడ । వెలుఁగుతీవిని వెలిఁగిరి ♦ విమలధౌత
వస్త్రములఁదాల్చి వా రని♦ర్వాచ్యమైన ♦ దివ్యసౌందర్య విభవసం♦దీప్తులగుచు॥ ౪౬

ధరణిపతియగు నాప్రియ♦దర్శనుండు । బుధసముఁడు ధర్మపత్నికిఁ ♦ బుణ్యాకృతికి
నదియునిదియునుజూపుచు ♦ నరుగుకతన । నెంతమార్గముగడచెనో ♦ యెఱుఁగఁడయ్యె॥

సంజయొడమెడుసరికి దు♦ష్ప్రాపయశుఁడు । పట్టమహిషీసఖుండగు ♦ ప్రభువరుండు
సద్దయమి ఋషీంద్రునాశ్రమ♦స్థలముసేరె । హయములెంతయుఁబరుగిడి ♦ యలసియుండె॥

వనాంతరాదుపావృత్తైః । సమిత్కుశఫలాహరైః
పూర్యమాణమదృశ్యాగ్ని । ప్రత్యుద్యాతైస్తపస్విభిః॥ ౪౯

ఆకీర్ణమృషిపత్నీనా । ముటజద్వారరోధిభిః
అపత్యైరివనీవార । భాగధేయోచితైర్మృగైః॥ ౫౦

సేకాంతేమునికన్యాభి । స్తత్క్షణోజ్ఝితవృక్షకం
విశ్వాసాయవిహంగానా । మాలవాలాంబుపాయినాం॥ ౫౧

ఆతపాత్యయసంక్షిప్త । నీవారాసునిషాదిభిః
మృగైర్వర్తితరోమంథ । ముటజాంగణభూమిషు॥ ౫౨

అభ్యుత్థితాగ్నిపిశునై । రతిథీనాశ్రమోన్ముఖాన్
పునానంపవనోద్ధూతై । ర్ధూమైరాహుతిగంధిభిః॥ ౫౩

అథయంతారమాదిశ్య । ధుర్యాన్విశ్రామయేతిసః
తామవారోపయత్పత్నీం । రథాదవతతారచ॥ ౫౪

తస్మైసభ్యాఃసభార్యాయ । గోప్త్రేగుప్తతమేంద్రియాః
అర్హణామర్హతేచక్రు । ర్మునయోనయచక్షుషే॥ ౫౫

విధేఃసాయంతనస్యాంతే । సదదర్శతపోనిధిం
అన్వాసితమరుంధత్యా । స్వాహయేవహవిర్భుజం॥ ౫౬

తయోర్జగృహతుఃపాదా । న్రాజారాజ్ఞీచమాగధీ
తౌగురుర్గురుపత్నీచ । ప్రీత్యాప్రతిననందతుః॥ ౫౭

తమాతిథ్యక్రియాశాంత । రథక్షోభపరిశ్రమం
పప్రచ్ఛకుశలంరాజ్యే । రాజ్యాశ్రమమునింమునిః॥ ౫౮

అథాథర్వనిధేస్తస్య । విజితారిపురః పురః
అర్థ్యామర్థపతిర్వాచ । మాదదేవదతాంవరః॥ ౫౯

ఉపపన్నంననుశివం । సప్తస్వంగేషుయస్య మే
దైవీనాం మానుషీణాంచ । ప్రతిహర్తాత్వమాపదాం॥ ౬౦

తవమంత్రకృతోమంత్రై । ర్దూరాత్ప్రశమితారిభిః
ప్రత్యాదిశ్యంతఇవమే । దృష్టలక్ష్యభిదఃశరాః॥ ౬౧

అంతఁ బరిసరవనముల ♦ యందునుండి । ఫలసమిత్కుశలను దాల్చి ♦ పాణులందుఁ
దాపసులువచ్చి నిండిరి ♦ తద్వనమునఁ । బొదలితమ్ము నదృశ్యాగ్ని ♦ యెదురుకొనఁగ॥

ద్వారమునకడ్డముగనిల్చి ♦ తమకుఁ గాఁగఁ । బెట్టునివ్వారిధాన్యంబుఁ ♦ బ్రీతిఁదినుచు
మిగులమచ్చికఁ జెలఁగిన ♦ మృగచయంబు । మునిసతులబిడ్డలట్టివి ♦ మూఁగియుండె॥ ౫౦

తరులకు జలంబువోసిన ♦ తత్క్షణంబ । తలఁగుచుండిరి మునికన్య ♦ లెలమితోడఁ
బాదులను నీరములుద్రాగు ♦ పక్షులకును । బూర్ణవిశ్వాస మెదలోనఁ ♦ బుట్టుకొఱకు॥

ఆరఁబోసిన నివ్వరి ♦ నాతపాంత । మందునొకమూల పర్ణశా ♦ లాంగణమునఁ
గుప్పవోసిన నటవచ్చి గుంపుగూడి । నెమరువేసెను మృగములు ♦ నెమ్మిమీఱ॥ ౫౨

ప్రజ్వలితమైనవహ్నిని ♦ బ్రకటపఱచి । యాహుతి సుగంధయుక్తమై ♦ యనిలధూత
మైనధూమమ్ముచేత నా ♦ యతిథివరులు । పూతులై పొల్చిరాశ్రమో ♦ న్ముఖులు సుఖులు॥

అంత సారథిఁజూచి య ♦ య్యశ్వములకుఁ । దగినవిశ్రాంతి యీఁదెల్పి ♦ తానురథము
డిగ్గి మెల్లఁగఁదనపత్ని ♦ డించుకొనియె । నాదిలీపనృపాలుఁ డా ♦ ప్లోషకరుఁడు॥ ౫౪

అర్ఘ్యుఁడు సభార్యుఁడును మఱి ♦ న్యాయచక్షుఁ । డైన యారక్షకుని సభ్యు ♦ లైనమునులు
మించి యింద్రియచయము ని ♦ ర్జించినట్టి । వారు పూజించి రఖిలోప ♦ చారములను॥ ౫౫

'స్వాహ'తోఁ గూడియొప్పెడు ♦ వహ్నివోలె । నయ్యరుంధతి తోఁబొల్చు ♦ నావసిష్ఠ
సుతపోనిధిఁ గాంచిరి ♦ యుచితవిధుల । నాచరించినమీఁద సం ♦ ధ్యాంతమందు॥ ౫౬

మగధవంశజయగు పట్ట ♦ మహిషితోడ । వారిపాదాబ్జములనంటె ♦ నానుమతీశుఁ
డంతగురుఁడును గురుపత్ని ♦ యమితదయను । వారిదీవించిచేసిరి ♦ గారవమును॥ ౫౭

రథగమనవేగకల్పిత ♦ శ్రమము నెల్ల । నతిథిసత్కారములఁబాసి ♦ యలరుచుండు
రాజ్యమను నాశ్రమము నేలు ♦ రాజఋషిని । ఋషియడిగె రాజ్యకుశలాది ♦ విషయములను॥

అంత నరిపురములనోర్చి ♦ యశముగన్న । ధరపతి దిలీపనృపతి యా ♦ థర్వనిధిని
నవ్వసిష్ఠునిగూర్చి స ♦ మంచితార్థ । భరిత గంభీరవాక్కులఁ ♦ బలికెనిట్లు॥ ౫౯

నాకుఁగల్గెడు దైవమా ♦ నవములైన । యాపదల హరియింపంగ ♦ నర్హులగుచు
మీరలుండఁగ మానీంద్ర ♦ మేలెకాక । యన్యమెటుకల్గు నాదు స ♦ ప్తాంగమందు. ౬౦

దూరమందుండి వైరులఁ ♦ ద్రుంచునట్టి । తావకసుమంత్ర రచితమం ♦ త్రములచేత
దృష్టిపథలక్ష్యములనె భే ♦ దించునట్టి । మామకశరాళియున్నది ♦ మళ్ళినట్లు॥ ౬౧

హవిరావర్జితంహోత । స్త్వయావిధివదగ్నిషు
వృష్టిర్భవతిసస్యానా । మవగ్రహవిశోషిణాం॥ ౬౨

పురుషాయుషజీవిన్యో । నిరాతంకానిరీతయః
యన్మదీయాః ప్రజాస్తస్య । హేతుస్త్వద్బ్రహ్మవర్చసం॥ ౬౩

త్వయైవంచింత్యమానస్య । గురుణాబ్రహ్మయోనినా
సానుబంధాఃకథంనస్యుః । సంపదోమేనిరాపదః॥ ౬౪

కింతువధ్వాంతవైతస్యా । మదృష్టసదృశప్రజం
నమామవతిసద్వీపా । రత్నసూరపిమేదినీ॥ ౬౫

నూనంమత్తః పరంవంశ్యాః । పిండవిచ్ఛేదదర్శినః
నప్రకామభుజఃశ్రాద్ధే । స్వధాసంగ్రహతత్పరాః॥ ౬౬

మత్పరందుర్లభంమత్వా । నూనమావర్జితంమయా
పయఃపూర్వైఃస్వనిఃశ్వాసైః । కవోష్ణముపభుజ్యతే॥ ౬౭

సోహంమిజ్యావిశుద్ధాత్మా । ప్రజాలోపనిమీలితః
ప్రకాశశ్చాప్రకాశశ్చ । లోకాలోకఇవాచలః॥ ౬౮

లోకాంతరసుఖంపుణ్యం । తపోదానసముద్భవం
సంతతిఃశుద్ధవంశ్యాహి । పరత్రేహచశర్మణే॥ ౬౯

తయాహీనంవిధాతర్మాం । కథంపశ్యన్నదూయసే
సిక్తంస్వయమివస్నేహా । ద్వంధ్యమాశ్రమవృక్షకం॥ ౭౦

అసహ్యపీడంభగవ । న్నృణమంత్యమవేహిమే
అరుంతుదమివాలాన । మనిర్వాణస్యదంతినః॥ ౭౧

తస్మాన్ముచ్యేయథాతాత । సంవిధాతుంత్వమర్హసి
ఇక్ష్వాకూణాందురాపేర్థే । త్వదధీనాహిసిద్ధయః॥ ౭౨

ఇతివిజ్ఞాపితోరాజ్ఞా । ధ్యానస్తిమితలోచనః
క్షణమాత్రమృషిస్తస్థౌ । సుప్తమీనఇవహ్రదః॥ ౭౩

సోపశ్యత్ప్రణిధానేన । సంతతేః స్తంభకారణం
భావితాత్మాభువోభర్తు । రథైనంప్రత్యబోధయత్॥ ౭౪

విధివిహితమైనవిధమున ♦ వీతిహోత్రు । నందునీవిడునట్టి హ♦వ్యమ్మువోయి
యయ్యవగ్రహశుష్కస ♦ స్యములఁ బ్రోచు । వర్షముగ మాఱివచ్చు బ్ర♦హ్మర్షివర్య॥ ౬౨

ఈతిబాధలు లేక ని♦ర్భీతులగుచుఁ । బూర్ణమైనట్టి యాయువుఁ ♦ బొందినాదు
ప్రజలు వర్ధిల్లుచెల్ల నీ ♦ ప్రబలమైన । బ్రహ్మవర్చసమునఁగాదె ♦ భవ్యమూర్తి॥ ౬౩

గురువులును బ్రహ్మపుత్త్రులై ♦ పరఁగుమీరు । నాకు మేలొడఁగూర్ప ను♦న్నారు గాన
నాపదకునన్నుఁ జేరఁగా ♦ నలవియగునె । సంపదనిరంతరాయమై ♦ సాగకున్నె॥ ౬౪

కాని సంతానరత్నంబు ♦ గాంచకుండు । నట్టి మీకోడలిని గాంచు ♦ నట్టినాకు
ద్వీపములతోడిమణులీను ♦ పృథ్వియిడదు । హర్షమింతయువినుము మ♦హర్షితిలక॥ ౬౫

నాదుపిమ్మటఁ బిండ వి♦చ్ఛేదమగుటఁ । గాంచిముందుగ స్వధ సంగ్ర♦హించుతమిని
దినరుగాఁబోలు పితరులు ♦ తృప్తిగాను । శ్రాద్ధములయందునిప్పుడు ♦ సిద్ధవర్య॥ ౬౬

నాయనంతర మివిలభ్య♦మా యటంచు । వేఁడియూర్పులఁ బితరులు ♦ వెచ్చఁజేసి
నేనొసంగెడు తర్పణ♦నీరములను । ద్రాగుచుండుదురని తోఁచుఁ ♦ దాపసేంద్ర॥ ౬౭

యజ్ఞములఁజేసినే విశు♦ద్ధాత్ముఁడయ్యు । సంతులేనికొఱంతఁ దే♦జమ్ము మాసి
చీఁకటియు వెల్తురునుగూడఁ ♦ జెందియున్న । చక్రవాళంబుఁబోలితి♦ సంయమీంద్ర॥ ౬౮

దానతపములనుద్భవ ♦ మైనయట్టి । వరసుకృతమిచ్చు సౌఖ్యంబు ♦ పరమునందు
ధన్యసద్వంశజన్యసం♦తాన మెన్నఁ । బరమసౌఖ్యంబులిడు నిహ♦పరములందు॥ ౬౯

స్వయముగానీరువోసి యా♦శ్రమమునందుఁ । బ్రేమతోఁ బెంపవంధ్యవృ♦క్షకమునవు
వగచువిధమున నాత్మసం♦భవవిహీనుఁ । డైననాకేలవగవవు ♦ హావిధాత॥ ౭౦

అంతిమఋణమ్ముదీర్పని ♦ యట్టిచింత । నోర్వఁగాఁజాలకున్నాఁడ ♦ నోమహాత్మ
జలకమొదవక గొలుసుచేఁ ♦ గలుగుమర్మ । భేదమగు బాధకోర్వని ♦ ద్విపమువోలె॥ ౭౧

తండ్రి! నాచింతదీర్పఁగాఁ ♦ దగుదువీవె । యెందునిక్ష్వాకుకులులను ♦ నందరాని
యర్థములయందుఁ దచ్ఛిద్ధి ♦ యార్యవినుత । నీయధీనంబెయగునుగా ♦ నిర్మలాత్మ॥ ౭౨

పృథ్విపతి యివ్విధంబున ♦ విన్నవింప । మౌనిచంద్రుఁడు నేత్రప♦ద్మములుమోడ్చి
క్షణముధ్యానస్థితుండయి ♦ కదలకుండె । మత్స్యములునిద్రవోయిన ♦ మడుఁగునాఁడ్కి॥ ౭౩

అట్లుప్రణిధానమునఁజూచి ♦ యమ్మహర్షి । సంతతిస్తంభకారణ ♦ మంతఁ గనిసి
భవ్యమహిమ విభూతిసం♦భరితుఁడతఁడు । భూపతికి నివ్విధంబున ♦ బోధసేసె॥ ౭౪

పురాశక్రముపస్థాయ । తవోర్వీంప్రతియాస్యతః
ఆసీత్కల్పతరుచ్ఛాయా । మాశ్రితా సురభిఃపథి॥ ౭౫

ధర్మలోపభయాద్రాజ్ఞీ । మృతుస్నాతామిమాం స్మరన్
ప్రదక్షిణక్రియార్హాయాం । తస్యాంత్వంసాధునాచరః॥ ౭౬

అవజానాసిమాంయస్మా । దతస్తేనభవిష్యతి
మత్ప్రసూతిమనారాధ్య । ప్రజేతిత్వాంశశాపసా॥ ౭౭

సశాపోనత్వయారాజన్ । నచసారథినాశ్రుతః
నదత్యాకాశగంగాయాః । స్రోతస్యుద్దామదిగ్గజే॥ ౭౮

ఈప్సితంతదవజ్ఞానా । ద్విద్ధిసార్గళమాత్మనః
ప్రతిబధ్నాతిహి శ్రేయః । పూజ్యపూజావ్యతిక్రమః॥ ౭౯

హవిషేదీర్ఘసత్రస్య । సాచేదానీంప్రచేతసః
భుజంగపిహితద్వారం । పాతాళమధితిష్ఠతి॥ ౮౦

సుతాంతదీయాంసురభేః । కృత్వాప్రతినిధింశుచిః
ఆరాధయసపత్నీకః । ప్రీతాకామదుఘాహిసా॥ ౮౧

ఇతివాదినఏవాస్య । హోతురాహుతిసాధనం
అనింద్యానందినీనామ । ధేనురావవృతేవనాత్॥ ౮౨

లలాటోదయమాభుగ్నం । పల్లవస్నిగ్ధపాటలా
బిభ్రతీ శ్వేతరోమాంకం । సంధ్యేవశశినంనవం॥ ౮౩

భువంకోష్ణేనకుండోధ్నీ । మేధ్యేనావభృథాదపి
ప్రస్రవేణాభివర్షంతీ । వత్సాలోకప్రవర్తినా॥ ౮౪

రజఃకణైఃఖురోద్భూతైః । స్పృశద్భిర్గాత్రమంతికాత్
తీర్థాభిషేకజాంశుద్ధి । మాదధానామహీక్షితః॥ ౮౫

తాంపుణ్యదర్శనాందృష్ట్వా । నిమిత్తజ్ఞస్తపోనిధిః
యాజ్యమాశంసితావంధ్య । ప్రార్థనంపునరబ్రవీత్॥ ౮౬

అదూరవర్తినీంసిద్ధిం । రాజన్విగణయాత్మనః
ఉపస్థితేయంకల్యాణీ । నామ్నికీర్తితఏవయత్॥ ౮౭

మున్నొకప్పుడు నీవు ప్ర♦మోదమతిని । సురపతినిఁ గొల్చియుఁ దివికి ♦ మరలుతఱిని
గల్పకమునీడ దారిలోఁ ♦ గామధేను । వెంతయును శాంతితోడ వి♦శ్రాంతినుండె॥ ౨౪

నీ ఋతుస్నాతయౌ రాణి ♦ నీవు దలఁచి । ధర్మలోపభయంబునఁ ♦ దరలివచ్చు
నప్పుడు ప్రదక్షిణక్రియ ♦ కర్హమైన । యా సురభి లెక్కగొనవైతి ♦ వవనిపాల॥ ౨౫

నన్ను నవమాన మొనరించి♦నావు గాన । నోరి ! నా బిడ్డ నర్చింప ♦ కుండ నీకు
సంతుగల్గదు పొమ్మంచు ♦ శాపమిచ్చెఁ । గోపభరమున నగ్గోవు ♦ భూపతిలక॥ ౨౬

తనప్రవాహములోన ను♦ద్దామగరిమ । దిగ్గజంబులు క్రీడింప ♦ దివిజగంగ
మ్రోయుచుండెను గాన నా ♦ మ్రోఁతలోన । నీకు సారథి కదిచెవి ♦ సోఁకదయ్యె॥ ౨౭

ఆ యపజ్ఞయె నీ వాంఛి♦తార్థములకు । నడ్డమయ్యెను దెలియుమో ♦ యార్యసత్య
పూజ్యపూజావ్యతిక్రమం♦బులు సలుపఁ । బ్రబలప్రతిబంధకములు శు♦భంబులకును॥ ౨౮

ప్రీతిఁ బాతాళమందుఁ బ్ర♦చేతసుండు । దీర్ఘసత్రము సల్పుచు ♦ దివ్యసురభి
హవికిఁ గొంపోయె నది యిప్పు♦డచట నుండు । భుజగములు ద్వారములు మూసి♦ పొదలుచుండు॥

దాని బిడ్డను బ్రతినిధి♦గాను జేసి । బద్ధకముమాని త్రికరణ ♦ శుద్ధితోడఁ
బూజసల్పుము పత్నితో ♦ భూమిపాల । మెచ్చెనే గామితమ్ముల ♦ నిచ్చునదియు॥ ౩౦

ఇట్లు పలుకుచునుండ ము♦నీంద్రుహోమి । యడవియందుండి యేతెంచె ♦ నతిప్రశస్త
యశనియాహుతిసాధన ♦ మైనయాప్త । నందినీధేను వందఱా♦నంద మొంద॥ ౩౧

క్రొంజిగురుచాయ నును మేను ♦ కొమరు మిగుల । నుదుటన అవంకరగ నుండి♦ పొదలుచుండు
శ్వేతరోమాంకమెంతయుఁ ♦ జెన్ను మీఱు । రంజిలెను నూత్నశశితోడి ♦ సంజవోలె॥ ౩౨

అంతఁ గుండంత పొదుగుతో ♦ నలరుధేను । నవభృథ జలమ్ములను మించి ♦ యమలమగుచుఁ
గ్రొంపుఁ జూచిన యంతనె ♦ చేఁపిపాలు । వెచ్చనౌ క్షీరధారలఁ ♦ బృథివిఁ దడిపె॥ ౩౩

గౌరి సెలను బుట్టు దుమ్మతోఁ ♦ దఱిసి నృపతి । నంగమును దాఁకి సకలతీ♦ర్థాభిషేక
ముల జనించెడు శుద్ధిని ♦ గలుగఁజేసె । నవ్వసిష్ఠుని పూజార్హ ♦ మైనగోవు॥ ౩౪

కొంచువారికిఁ బుణ్యమ్ము ♦ నించునట్టి । ధేనువును జూచి శకునజ్ఞుఁ♦డైన మౌని
యత్తపోనిధి ప్రార్థనల్ ♦ రిత్తవోని । యాజ్యునకు రాజునకు మఱి ♦ యని యెనిట్లు॥ ౩౫

దివ్యమంగళమూర్తి యీ ♦ ధేనువిటకుఁ । దడవినంతనె యరుదెంచెఁ ♦ దడవు లేదు
వినుము నీ వాంఛితము నెఱ♦వేఱఁగలదు । సంశయము లేదు సకలరా♦జన్యవినుత॥ ౩౬

వన్యవృత్తిరిమాంశశ్వ । దాత్మానుగమనేనగాం
విద్యామభ్యసనేనేవ । ప్రసాదయితుమర్హసి॥ ౮౮

ప్రస్థితాయాంప్రతిష్ఠేథాః । స్థితాయాంస్థితిమాచరేః
నిషణ్ణాయాం నిషీదాస్యాం । పీతాంభసిపిబేరపః॥ ౮౯

వధూర్భక్తిమతీచైనా । మర్చితామాతపోవనాత్
ప్రయతాప్రాతరన్వేతు । సాయంప్రత్యుద్వ్రజేదపి॥ ౯౦

ఇత్యాప్రసాదాదస్యాస్త్వం । పరిచర్యాపరోభవ
అవిఘ్నమస్తుతేస్థేయాః । పితేవధురిపుత్రిణాం॥ ౯౧

తథేతిప్రతిజగ్రాహ । ప్రీతిమాన్సపరిగ్రహః
ఆదేశందేశకాలజ్ఞః । శిష్యఃశాసితురానతః॥ ౯౨

అథప్రదోషేదోషజ్ఞః । సంవేశాయవిశాంపతిం
సూనుఃసూనృతవాక్స్రష్టు । ర్విససర్జోర్జితశ్రియం॥ ౯౩

సత్యామపితపఃసిద్ధౌ । నియమాపేక్షయామునిః
కల్పవిత్కల్పయామాస । వన్యామేవాస్యసంవిధాం॥ ౯౪

నిర్దిష్టాంకులపతినాసపర్ణశాలా । మధ్యాస్యప్రయతపరిగ్రహద్వితీయః
తచ్ఛిష్యాధ్యయననివేదితావసానాం । సంవిష్టఃకుశశయనేనిశాంనినాయ॥ ౯౫

ఇతి శ్రీరఘువంశే మహాకావ్యే కవిశ్రీకాళిదాసకృతౌ వసిష్ఠాశ్ర
మాభిగమనోనామ ప్రథమఃసర్గః॥



కందమూలఫలాలు నీ ♦ కడుపునించి । యనుదినముదీని విడువక ♦ యనుసరించి
కడఁగియభ్యాసమున విద్యఁ ♦ గాంచునట్లు। గనుముదీనియనుగ్రహం ♦ బనఘ నీవు॥ ౮౮

వెడలినప్పుడుదీనితో ♦ వెడలవలయు । నిలిచినప్పుడుదీనితో ♦ నిలువవలయుఁ
గూరుచుండిననీవును ♦ గూరుచుండి । త్రాగజలమును నీవును ♦ ద్రాగవలయు॥ ౮౯

భక్తి నీదేవి దీని ప్ర♦భాతవేళఁ । బూజసేసితపోవన ♦ భూమిదాఁటి
వంతకును వెంబడించి సా♦యంతనమున । నెదురుకొని తెచ్చుఁగాక పృ♦థ్వీశచంద్ర॥ ౯౦

ఇప్పగిదినీవు నందిని ♦ మెప్పునడయు । వఱకుఁ బరిచర్యలందుఁ ద♦త్పరుఁడవగుము
జయమగును గాక నీకు నీ ♦ జనకునట్లు । పుత్త్రవంతుల కగ్రిమఁ ♦ బొల్తుగాక॥ ౯౧

అనిన నాదేశకాలజ్ఞుఁ ♦ డైననృపుఁడు । చిత్తమరిభార్యతోఁ గూడ ♦ శిరమువంచి
గురువొసంగిన యాజ్ఞలఁ ♦ గూర్మితోడ । స్వీకరించెను లోకసం ♦ ప్రీతికరుఁడు॥ ౯౨

రాత్రిదరిసినవంత నా♦బ్రహ్మసుతుఁడు । దోషవిదుఁడును మఱిసత్య ♦ భాషణుండు
సెలవొసంగెను నిద్రింప ♦ లలితమతికి । వెన్నరానన్ని సిరులను ♦ గన్నపతికి॥ ౯౩

తాఁదపస్సిద్ధుఁడైయుంట ♦ తథ్యమయ్యె । నవ్వసిష్ఠుఁడు రాజేంద్రు ♦ నంతనుండి
ప్రీతిరిగాఁజేయుకోర్కెలో ♦ నన్యమైన । తల్పసామగ్రియొగిగించెఁ ♦ గల్పమెఱిఁగి॥ ౯౪

చంపకము.

కులపతియౌవసిష్ఠముని ♦ కూర్మినిజూపిన పర్ణశాలలోఁ
పలఁ గుశశయ్యపై నృపుఁడు ♦ పత్నియుతోడుగ రాత్రిఁబుచ్చి తాఁ
దెలిసె నిశాంతమందు ముని♦కేమణిశిష్యులు సేయుచుండు నా
సలలితవేదపాఠములు ♦ శ్రావ్యముగాఁ జెవిసోఁకుచుండుటన్॥ ౯౫

గద్య.

ఇది శ్రీ పరమేశ్వర కరుణాకలిత లలితకవితాకలిత శ్రీరామలక్ష్మాంబాబుద్ధి
వేంకయామాత్యతనూజాత సకలసజ్జనవిధేయ ఆదిపూడి సోమనాథ
నామధేయప్రణీతంబైన యాంధ్రరఘువంశమ్మునందు వసి
ష్ఠాశ్రమాభిగమనమ్మను ప్రథమాశ్వాసము
సంపూర్ణము.



శ్రీ

# రఘువంశమ్

## ద్వితీయః సర్గః

---

అథప్రజానామధిపః ప్రభాతే । జాయాప్రతిగ్రాహితగంధమాల్యాం
వనాయపీతప్రతిబద్ధవత్సాం । యశోధనో ధేనుమృషేర్ముమోచ॥ ౧

తస్యాః ఖురన్యాస పవిత్రపాంసు । మపాంసులానాంధురికీర్తనీయా
మార్గంమనుష్యేశ్వర ధర్మపత్నీ । శ్రుతేరివార్థం స్మృతిరన్వగచ్ఛత్॥ ౨

నివర్త్యరాజాదయితాందయాళు । స్తాంసౌరభేయీంసురభిర్యశోభిః
పయోధరీభూతచతుస్సముద్రాం । జుగోపగోరూపధరామివోర్వీం॥ ౩

వ్రతాయతేనానుచరేణధేనో । ర్న్యషేధిశేషోఽప్యనుయాయివర్గః
నచాన్యతస్తస్యశరీరరక్షా । స్వవీర్యగుప్తాహిమనోః ప్రసూతిః॥ ౪

ఆస్వాదవద్భిఃకబలైస్తృణానాం । కండూయనైర్దంశనివారణైశ్చ
అవ్యాహతైఃస్వైరగతైఃసతస్యాః । సమ్రాట్ సమారాధనతత్పరోఽభూత్॥ ౫

స్థితఃస్థితాముచ్చలితఃప్రయాతాం । నిషీదుషీమాసనబంధధీరః
జలాభిలాషీజలమాదదానాం । ఛాయేవతాంభూపతి రన్వగచ్ఛత్॥ ౬

సన్యస్తచిహ్నామపి రాజ్యలక్ష్మీం । తేజోవిశేషానుమితాందధానః
ఆసీదనావిష్కృతదానరాజి । రంతర్మదావస్థ ఇవద్విపేంద్రః॥ ౭

లతాప్రతానోద్గ్రథితైఃసకేశై । రధిజ్యధన్వావిచచారదావం
రక్షాపదేశాన్మునిహోమధేనో । ర్వన్యాన్వినేష్యన్నివదుష్టసత్త్వాన్॥ ౮

విసృష్టపార్శ్వానుచరస్యతస్య । పార్శ్వద్రుమాః పాశభృతా సమస్య
ఉదీరయామాసు రివోన్మదానా । మాలోకశబ్దంవయసాంవిరావైః॥ ౯



శ్రీ

# ర ఘు వం శ ము.

## ద్వితీయాశ్వాసము.

——:o:——

### గీతములు.

అంతఁ దనపత్ని గంధమా♦ల్యాదికములఁ । బూజసేసినమునిధేను♦వును విభుండు
వనమునంకకుపదలెఁ బ్రి♦భాతవేళఁ । బాలుద్రాగినదూడను ♦ బట్టి కట్టి॥ ౧

శ్రుతిననుసరించు స్మృతివోలె ♦ సురభిపుత్రి । యడుగుఁదమ్ములఁబావన ♦ మైనపథము
సతులలోనగ్రగణ్యయై ♦ చన్నయట్టి । యాయశోధను సుకళత్రి ♦ మనుగమించె॥ ౨

సంద్రములునాలుగును దన♦చనులు గాఁగ । నవనిగోరూపముధరించె ♦ ననఁగనొప్పు
నావు రక్షింపవెడలె భా♦గ్యనుమరల్చి । పరమకరుణాళువైన యా♦భవ్యయశుఁడు॥ 3

అంత వ్రతమతిగోవుతో ♦ నరుగునృపతి । యనుచరులడించి చనెఁ దపో♦వనమునంద
యాత్మతేజంబెప్రాపుగా ♦ నలరుచుండు । మనుకులజుఁ డంగరక్షకై♦కొను నెపరుల॥ ౪

మంచిపచ్చికదినిపించి ♦ మించుప్రేమ । వాలుదోమలనీఁగలఁ ♦ దోలిదువ్వ
యిచ్చవచ్చినగతి నేగ ♦ నిచ్చిదాని । సేవఁజేయుచునుండెఁ బృ♦థ్వీశ్వరుండు॥ ౫

ఏగ నేగును నిల్చిన ♦ నెలమినిల్చుఁ । గూరుచుండినఁగుదివడి ♦ కూరుచుండు
జలములనుగ్రోలుచుండఁగా ♦ జలముఁగ్రోలు । ఛాయవలె దానివెంబడి ♦ సంచరించు॥ ౬

దాన రేఖలు వెలుపల ♦ దాల్పకుండ । లోనమదమునఁబొదలెడు ♦ నేనుఁగట్లు
చిహ్నవర్జితరాజ్యల♦క్ష్మినిధరించి । మించుతేజాన నృపుఁ డను♦మేయుఁడయ్యె॥ ౭

తీఁగెపోఁగులఁ గేశముల్ ♦ తీర్చికట్టి । యెక్కిడినచాపమును ధరి♦యించిచేతఁ
గానఁదిరిగెను మునిగోవుఁ♦గాచుమిషను । గ్రూరమృగములకును శిక్షఁ ♦ గూర్చునట్లు ౮

అనుచరులవీడి యడవిలో ♦ నరుగునతని । వరుణసదృశునినిరుగడ ♦ వాలుశాఖలు
ఖగకులము లేచి చేసెడు ♦ కలరవముల ♦ జయజయనినాదములుసల్పు ♦ సరణిఁగాంచె॥ ౯

మరుత్ప్రయుక్తాశ్చ మరుత్సఖాభం । తమర్చ్యమారాదభివర్తమానం
అవాకిరన్బాలలతాః ప్రసూనై । రాచారలాజైరివ పౌరకన్యాః॥ ౧౦

ధనుర్భృతోఽప్యస్య దయార్ద్రభావ । మాఖ్యాతమంతఃకరణైర్విశఙ్కైః
విలోకయన్త్యో వపురాపురక్ష్ణాం । ప్రకామవిస్తారఫలం హరిణ్యః॥ ౧౧

సకీచకైర్మారుతపూర్ణరంధ్రైః । కూజద్భిరాపాదితవంశకృత్యం
శుశ్రావ కుంజేషు యశః స్వముచ్చై । రుద్గీయమానం వనదేవతాభిః॥ ౧౨

పృక్తస్తుషారైర్గిరినిర్ఝరాణా । మనోకహాకంపితపుష్పగంధీ
తమాతపక్లాంతమనాతపత్ర । మాచారపూతం పవనః సిషేవే॥ ౧౩

శశామ వృష్ట్యాపి వినా దవాగ్ని । రాసీద్విశేషా ఫలపుష్పవృద్ధిః
ఊనం న సత్త్వేష్వధికో బబాధే । తస్మిన్వనం గోప్తరి గాహమానే॥ ౧౪

సంచారపూతాని దిగంతరాణి । కృత్వా దినాంతే నిలయాయ గంతుం
ప్రచక్రమే పల్లవరాగతామ్రా । ప్రభా పతంగస్య మునేశ్చ ధేనుః॥ ౧౫

తాం దేవతాపిత్రతిథిక్రియార్థా । మన్వగ్యయౌ మధ్యమలోకపాలః
బభౌ చ సా తేన సతాం మతేన । శ్రద్ధేవ సాక్షాద్విధినోపపన్నా॥ ౧౬

సపల్వలోత్తీర్ణవరాహయూథా । న్యావాసవృక్షోన్ముఖబర్హిణాని
యయౌ మృగాధ్యాసితశాద్వలాని । శ్యామాయమానాని వనాని పశ్యన్॥ ౧౭

ఆపీనభారోద్వహనప్రయత్నా । ద్గృష్టిర్గురుత్వాద్వపుషో నరేంద్రః
ఉభావలంచక్రతురంచితాభ్యాం । తపోవనావృత్తిపథం గతాభ్యాం॥ ౧౮

వసిష్ఠధేనోరనుయాయినం త । మావర్తమానం వనితా వనాంతాత్
పపౌ నిమేషాలసపక్ష్మపంక్తి । రుపోషితాభ్యామివ లోచనాభ్యాం॥ ౧౯

పురస్కృతా వర్త్మని పార్థివేన । ప్రత్యుద్గతా పార్థివధర్మపత్న్యా
తదంతరే సా విరరాజ ధేను । ర్దినక్షపామధ్యగతేవ సంధ్యా॥ ౨౦

ప్రదక్షిణీకృత్య పయస్వినీం తాం । సుదక్షిణా సాక్షతపాత్రహస్తా
ప్రణమ్య చానర్చ విశాలమస్యాః । శృంగాంతరం ద్వారమివార్థసిద్ధేః॥ ౨౧

వత్సోత్సుకాపి స్తిమితా సపర్యాం । ప్రత్యగ్రహీత్సేతి ననందతుస్తౌ
భక్త్యోపపన్నేషు హి తద్విధానాం । ప్రసాదచిహ్నాని పురఃఫలాని॥ ౨౨

అగ్ని తేజంబుతోఁ బోల్చు ♦ నా నృపాలు । కెలనగాలిని జిన్నతీఁ♦గెలను వీడి
రాలు పూలెన్న నిజ్జన♦పాలుమీఁద । బాలికలు పురిఁ జల్లు పే♦లాలఁ బోలె॥ ౧౦

చేతధనువున్నఁ గరుణార్ద్ర♦చిత్తుఁడంచు । నంతరాత్మ నెఱింగింప ♦ నా నృపేంద్రుఁ
జూచె నిశ్శంకతో హరి♦ణీచయంబు । వెడఁద కన్నులు సఫలతఁ ♦ బడయునట్లు॥ ౧౧

వెదురులం గలరంధ్రాళి ♦ వీచు గాలి । వేణుమధురనినాదమై ♦ వేడ్కఁ గొలుప
దానికనువుగ వనదేవ♦తాచయంబు । తనయశముఁ గుంజములఁ బాడ ♦ వినెనతండు॥ ౧౨

ఆతఁడాచారపూతుఁడై ♦ యాతపత్ర । మును ధరింపమి నెండచేఁ ♦ దనువు వాడ
గిరిఝరతుషారచయముతోఁ ♦ దరులఁ గల్గు । నలరుగంధముతో గాలి ♦ సలిపె సేవ॥ ౧౩

పాలకుఁడతండు వనములోఁ ♦ గాలువెట్ట । జల్లు లేకయె దావాగ్ని ♦ చల్లనయ్యె
వృక్షములఁ బుష్పఫలములు ♦ వృద్ధియయ్యె । నధికసత్త్వాళిబాధ దీ♦నాళి కుడిగె॥ ౧౪

అమలసంచారములను ది♦గంతములను । నెంతయును శుద్ధిపఱిచి ది ♦ నాంతమందుఁ
దలిరుకెంజాయతోడను ♦ ధనువులలర । నినుఁడు గోవును మళ్ళిరి ♦ యింటివంక॥ ౧౫

పితృతిథిదేవతార్చన ♦ విధులయందు । నిఖిగనుండెడు నందిని ♦ నృపవరేణ్యుఁ
డనుగమింపంగ నతనితో ♦ నలరు గోవు । ధర్మవిధితోడి శ్రద్ధనాఁ ♦ దనరుచుండె॥ ౧౬

అడుసు నెల్వడు వనవరా♦హములదానిఁ । దమతరులఁ జేరఁ జను మయూ♦రములదాని
లేళ్ళఁ బచ్చిక యొప్పుబ♦యళ్ళదాని । శ్యామలవనమ్ముఁ జూచుచుఁ ♦ జనియె ఱేఁడు॥ ౧౭

లేఁత ప్రాయమునొక్కచే ♦ యీఁతగల్గి । పొదుగుభారము నోర్వక ♦ పోవలు నావు
బలిసిన శరీరమొప్పెడు ♦ పార్థివుండు । మార్గము నలంకరించిరి ♦ మరలి సుగతి॥ ౧౮

మునివసిష్ఠుని గోవుతో ♦ ననుసరించి । వనమునందుండి మరలిన ♦ భర్తనపుడు
ఱెప్పవేయక పతిభక్తి ♦ నొప్పుమీఱఁ । గాంచెఁ దత్పత్ని కన్నుల ♦ కఱవుదీఱ॥ ౧౯

వెనుక నారాజశేఖరుఁ ♦ డనుగమింప । రాజ్ఞి ముందు నెదుర్కొని ♦ రాఁగ నడుమఁ
బగటికిని రాత్రికిని మధ్యఁ ♦ బరఁగుచుండు । సంధ్యకైవడిఁ జెలువొందె ♦ సౌరభేయి॥ ౨౦

గోవుచుట్టు ప్రదక్షిణం ♦ గూర్మిఁ దిరిగి । పాణితలమున నక్షత♦పాత్రిఁ దాల్చి
యర్థసిద్ధిమహాద్వార ♦ మనఁగ నొప్పు । శృంగమధ్యంబుఁ బూజించెఁ ♦ జేరి మ్రొక్కి॥ ౨౧

వత్సమును జూచుకుతుకమ్ము ♦ ప్రబలమైన । శాంతితోఁ బూజఁ గొనెనని ♦ సంతసిల్లి
భక్తులందు మహాత్ములు ♦ ప్రకటపఱుచు । నెమ్మి సూచించు ఫలము స♦న్నిహితమందు॥ ౨౨

గురోస్సదారస్య నిపీడ్యపాదౌ । సమాప్య సాంధ్యంచవిధిందిలీపః
దోహావసానే పునరేవదోగ్ధ్రీం । భేజేభుజోచ్ఛిన్నరిపుర్నిషణ్ణాం॥ ౨౩

తామంతికన్యస్త బలిప్రదీపా । మన్వాస్యగోప్తా గృహిణీసహాయః
క్రమేణసుప్తామనుసంవివేశ । సుప్తోత్థితాంప్రాతరనూదతిష్ఠత్॥ ౨౪

ఇత్థంవ్రతంధారయతఃప్రజార్థం । సమంమహిష్యామహనీయకీర్తేః
సప్తవ్యతీయుస్త్రిగుణానితస్య । దినానిదీనోద్ధరణోచితస్య॥ ౨౫

అన్యేద్యురాత్మానుచరస్యభావం । జిజ్ఞాసమానామునిహోమధేనుః
గంగాప్రపాతాంతవిరూఢశష్పం । గౌరీగురోర్గహ్వరమావివేశ॥ ౨౬

సాదుష్ప్రధర్షామనసాపిహింస్రై । రిత్యద్రిశోభాప్రహితేక్షణేన
అలక్షితాభ్యుత్పతనోనృపేణ । ప్రసహ్యసింహఃకిల తాంచకర్ష॥ ౨౭

తదీయమాక్రందితమార్తసాధో । ర్గుహానిబద్ధప్రతిశబ్దదీర్ఘం
రశ్మిష్వివాదాయనగేంద్రసక్తాం । నివర్తయామాసనృపస్యదృష్టిం॥ ౨౮

సపాటలాయాంగవితస్థివాంసం । ధనుర్ధరః కేసరిణందదర్శ
అధిత్యకాయామివధాతుమయ్యాం । లోధ్రద్రుమంసానుమతఃప్రఫుల్లం॥ ౨౯

తతోమృగేంద్రస్యమృగేంద్రగామీ । వధాయవధ్యస్యశరంశరణ్యః
జాతాభిషంగోనృపతిర్నిషంగా । దుద్ధర్తుమైచ్ఛత్ప్రసభోద్ధృతారిః॥ ౩౦

వామేతరస్తస్యకరఃప్రహర్తు । ర్నఖప్రభాభూషితకంకపత్రే
సక్తాంగులిఃసాయకపుంఖఏవ । చిత్రార్పితారంభ ఇవావతస్థే॥ ౩౧

బాహుప్రతిష్టంభవివృద్ధమన్యు । రభ్యర్ణమాగస్కృతమస్పృశద్భిః
రాజాస్వతేజోభిరదహ్యతాంత । ర్భోగీవమంత్రౌషధిరుద్ధవీర్యః॥ ౩౨

తమార్యగృహ్యం నిగృహీతధేను । ర్మనుష్యవాచామనువంశకేతుం
విస్మాయయ న్విస్మితమాత్మవృత్తౌ । సింహోరుసత్త్వం నిజగాదసింహః॥ ౩౩

అలంమహీపాలతవశ్రమేణ । ప్రయుక్తమప్యస్త్రమితోవృథాస్యాత్
నపాదపోన్మూలనశక్తిరంహః । శిలోచ్చయేమూర్ఛతిమారుతస్య॥ ౩౪

కైలాసగౌరంవృషమారురుక్షోః । పాదార్పణానుగ్రహపూతపృష్ఠం
అవేహిమాంకింకరమష్టమూర్తేః । కుంభోదరంనామనికుంభతుల్యం॥ ౩౫

గురువునకు గురుపత్నికిఁ ♦ గూర్మి మ్రొక్కి । సాంధ్యవిధిఁ దీర్చి భుజజిత♦శత్రుఁ డంత
క్షీరములనిచ్చి తిన్నఁగాఁ ♦ గూరుచున్న । ధేనువును గొల్వ వచ్చెఁ బృ♦థ్వీధవుండు॥ ౨౩

దీపమును మేఁత వెట్టి నం♦దినికి ముందు । రాణితోఁ గూడఁ గూర్చుండి ♦ రక్షకుండు
క్రమముగా నది నిద్రింపఁ ♦ గనులు మూసి । రేపకడ నది లేచిన ♦ నృపుఁడు లేచె॥ ౨౪

ధన్యతరకీర్తి దీనసం♦త్రాణమూర్తి । పార్థివేంద్రుండు సంతతిఁ ♦ బడయ నెంచి
రాణితో నివ్విధంబున ♦ వ్రతమొనర్ప । దినము లిరువదియొక్కటి ♦ చనియె నంత॥ ౨౫

మఱుదినమ్మున నృపచంద్రు♦మనము నరయ । కాంక్షఁ జేరెను గోవు గం♦గాప్రపాత
పరసరప్రాంతజనితశా♦ద్వలము చేత । సుందరంబగు హిమగిరి ♦ కందరంబు॥ ౨౬

క్రూరమృగతతులీ గోవుఁ ♦ జేరఁదలఁచి । బ్రిదుకు సేయని శైలప్ర♦భాసములను
దృష్టి పఱపిన నరపతి ♦ యెఱుఁగకుండ । నొక్క సింహంబు దానిపై ♦ కుఱికి పట్టె॥ ౨౭

గుహలు మార్మ్రోయునట్లుగా ♦ గోవు సేయు । దీర్ఘమాక్రందనధ్వని ♦ దీనబంధుఁ
డైన యాతని గిరిసక్త ♦ మైన దృష్టి । లాగి వైచెను త్రాటిచే ♦ లాగినట్లు॥ ౨౮

ధాతుమయమయి యొప్పు నె♦త్తమ్మి మీఁదఁ । బూచి పొలుపొందు లోధ్ర♦భూజమట్లు
క్రొంజిగురుఛాయ గల్గిన ♦ గోవుమీఁద । నున్న మృగనాథుఁ గనియె నా♦యోధుఁ డపుడు॥

సింహగమనుండు నరపాల♦సింహుఁ డార్త । రక్షణాచణుండు శౌర్యని♦పుణుండు
పరిభవము డింప వధ్యమౌ ♦ హరిని ద్రుంపఁ । దీవ్రశరమును బొదినుండి ♦ తీయఁదొడఁగ॥

గోళ్ళు గరులకుఁ గ్రొంజిగిఁ ♦ గొల్పుచుండ । వ్రేళ్ళు శర పుంఖమునఁ జిక్కి ♦ నచలనుండెఁ
జిత్తరువునందువలె నిల్చెఁ ♦ జితరిపుతతి । తృణములోఁ గొట్టనున్న ద♦ండధరంబు॥ ౩౧

బద్ధభుజుఁడౌట నారాజు ♦ క్రుద్ధుఁడగుచు । సిద్ధమంత్రౌషధంబుల ♦ రుద్ధవీర్య
మైన యహివలె మండె లో♦లోననప్పు । డట్లుడాసిన యపరాధ ♦ మంటఁగాఁడు॥ ౩౨

కేసరిబలుండు మనువంశ♦కేతు విట్టు । లాత్మచరితకు వెఱగంది ♦ నతనిఁ జూచి
యావుఁ బట్టిన హర్యక్షు ♦ మంతకంటె । నచ్చెరువుగూర్చు మనుజనా♦థ్యయములనియె॥

చాలుఁ జాలును భూపాల ♦ శ్రమము నేల । బాణమేసిన నదియును ♦ భగ్నమగును
దరులఁ బెకలించు నేకాని ♦ గిరులఁ గూల్పఁ । జాలు నే గాలి యెంతటి ♦ గట్టి యున్న॥ ౩౪

వెండిమలవలె వెల్లనౌ ♦ వృషభమెక్కు । నపుడు నా పృష్ఠమందు నా ♦ యష్టమూర్తి
పాదముల మెట్టి నన్నుఁ బా♦వనము సేయుఁ । గూర్మిఁ గుంభోదరుండను ♦ కింకరుండ॥

అముం పురః పశ్యసి దేవదారుం । పుత్రీకృతోసౌ వృషభధ్వజేన
యో హేమకుంభస్తననిఃసృతానాం । స్కందస్య మాతుః పయసాం రసజ్ఞః॥ ౩౬

కండూయమానేన కటం కదాచి । ద్వన్యద్విపేనోన్మథితా త్వగస్య
అథైనమద్రేస్తనయా శుశోచ । సేనాన్యమాలీఢమివాసురాస్త్రైః॥ ౩౭

తదాప్రభృత్యేవ వనద్విపానాం । త్రాసార్థమస్మిన్నహమద్రికుక్షౌ
వ్యాపారితః శూలభృతా విధాయ । సింహత్వమంకాగతసత్త్వవృత్తి॥ ౩౮

తస్యాలమేషా క్షుధితస్య తృప్త్యై । ప్రదిష్టకాలా పరమేశ్వరేణ
ఉపస్థితా శోణితపారణా మే । సురద్విషశ్చాంద్రమసీ సుధేవ॥ ౩౯

స త్వం నివర్తస్వ విహాయ లజ్జాం । గురోర్భవాన్దర్శితశిష్యభక్తిః
శస్త్రేణ రక్ష్యం యదశక్యరక్షం । న తద్యశః శస్త్రభృతాం క్షిణోతి॥ ౪౦

ఇతి ప్రగల్భం పురుషాధిరాజో । మృగాధిరాజస్య వచో నిశమ్య
ప్రత్యాహతాస్త్రో గిరిశప్రభావా । దాత్మన్యవజ్ఞాం శిథిలీచకార॥ ౪౧

ప్రత్యబ్రవీచ్చైనమిషుప్రయోగే । తత్పూర్వసంగే వితథప్రయత్నః
జడీకృతస్త్ర్యంబకవీక్షణేన । వజ్రం ముముక్షన్నివ వజ్రపాణిః॥ ౪౨

సంరుద్ధచేష్టస్య మృగేంద్ర కామం । హాస్యం వచస్తద్యదహం వివక్షుః
అంతర్గతం ప్రాణభృతాం హి వేద । సర్వం భవాన్భావమతోభిధాస్యే॥ ౪౩

మాన్యః స మే స్థావరజంగమానాం । సర్గస్థితిప్రత్యవహారహేతుః
గురోరపీదం ధనమాహితాగ్నే । ర్నశ్యత్పురస్తాదనుపేక్షణీయం॥ ౪౪

స త్వం మదీయేన శరీరవృత్తిం । దేహేన నిర్వర్తయితుం ప్రసీద
దినావసానోత్సుకబాలవత్సా । విసృజ్యతాం ధేనురియం మహర్షేః॥ ౪౫

అథాంధకారం గిరిగహ్వరాణాం । దంష్ట్రామయూఖైః శకలాని కుర్వన్
భూయః స భూతేశ్వరపార్శ్వవర్తీ । కించిద్విహస్యార్థపతిం బభాషే॥ ౪౬

ఏకాతపత్రం జగతః ప్రభుత్వం । నవం వయః కాంతమిదం వపుశ్చ
అల్పస్య హేతోర్బహు హాతుమిచ్ఛన్ । విచారమూఢః ప్రతిభాసి మే త్వం॥ ౪౭

భూతానుకంపా తవ చేదియం గౌ । రేకా భవేత్స్వస్తిమతీ త్వదంతే
జీవన్పునః శశ్వదుపప్లవేభ్యః । ప్రజాః ప్రజానాథ పితేవ పాసి॥ ౪౮

అదిగో యాదేవదారువు ♦ నావృషాంకుఁ । డాత్మపుత్త్రునిలీలఁ దా ♦ నరయుచుండు
వినుకుమారునితల్లిదౌ ♦ కనకకుంభ । కుచపయోధారరుచిఁగాంచి ♦ కొమరుమిగులు॥

వనగజంబొండు తీఁటవో ♦ వఁగను దీనిఁ । జెక్కులను బెట్టిరాయఁగాఁ ♦ జెక్కులెత్తె
నసురశరముల సేనాని ♦ కయిన గాయ । ములకుఁ బొక్కినయట్టులు ♦ పొక్కుగారి॥ ౩౭

అదిమొదలు నాకు శూలి సిం ♦ హత్వమిచ్చి । యంకగతసత్వములఁదిన ♦ నాజ్ఞయొసఁగి
కాననంబునఁ దిరిగెడు ♦ కరులకెల్లఁ । ద్రాసమిడనుంచె నీ గుహాం ♦ తరమునందు॥ ౩౮

ఈశ్వరునిచేత నిర్వ్యాధి ♦ నిప్పుడొందవె ! క్షుధితుఁడైనట్టి నాతృప్తి ♦ కొఱకుఁగాను
రక్తమయభోజనం బిది ♦ రాహువునకుఁ । జంద్రసుధవోలె నిదిచాలు ♦ సార్వభౌమ॥

వీడిఁజను దీనిని ♦ విడిచినీవు । శిష్యభక్తిని గురుని ద ♦ ర్శింపఁ బొమ్ము
శస్త్రముల రక్ష్యరక్ష య ♦ శక్యమేని । కలదె యపకీర్తి శస్త్రధా ♦ రులకు జగతి॥ ౪౦

ప్రౌఢముగనిట్లు మృగరాజు ♦ పల్కుటయును । రాజువినఁగానె తనయస్త్ర ♦ రాజమునకు
భవునిచేఁ గల్గినట్టియా ♦ భంగపాటు । వలనఁబొడమిన యా చింత ♦ తొలఁగెఁగొంత॥ ౪౧

వజ్రమునవైవనుండఁగా ♦ ఫాలనేత్రు । వాడిచూపుల జడుఁడైన ♦ వజ్రివోలె
నెన్నఁడు శరప్రయోగమం ♦ దింతముఁదు । భంగమెఱుఁగని యాఱేఁడు ♦ పలికెనిట్లు॥ ౪౨

కట్టువడినట్టి నాదువా ♦ క్యమ్ము నీకు । నోమృగేంద్రమ పరిహాస ♦ యోగ్యమైనఁ
బ్రాణులమనంబులందుండు ♦ భావములను । దెలియువాఁడవుగావునఁ ♦ బలుకువాఁడ॥ ౪౩

జంగమస్థావరమ్ముల ♦ జననభరణ । నాశకారణునకు వంద ♦ నంబొనర్తు
నాహితాగ్నియు గురువగు ♦ నతనిధనము । నాశమగుటోర్వ నీలీల ♦ నాదుప్రోల॥ ౪౪

ఆఁకలినిదీర్చుకొనుము నా ♦ యంగమునను । సంజఁదల్లిని జూచెడు ♦ సంభ్రమమున
నుండు దూడకు సంతోష ♦ మొదవునట్లు । విడువుము ఋషీంద్రు ధేనువు ♦ వేఁడికొనెద॥

అనిన గిరిగహ్వరంబుల ♦ యంధకార । మంతయును గోరపన్నుల ♦ కాంతిఁదొలఁగఁ
జిన్నినగవునునవ్వి వీ ♦ క్షించినృపునిఁ । బలికెఁ దానిట్టు లీశ్వర ♦ పార్శ్వవర్తి॥ ౪౬

అ[illegible]కిని నీప్రభుత్వ మే ♦ కాతపత్రి । మంగమోకాంతిమంతము ♦ యౌవనంబు
నందునున్నాఁడ విదియెల్ల ♦ నల్పమునకు । వీడు నీవెన్న మాఱేసి ♦ వాఁడ[illegible]॥ ౪౭

దయదలఁచితేని నీకు నఁ ♦ తఁబుగలిగి । ధేనువా[illegible] సేమంబుఁ ♦ బూనఁగలదు
నీవు గలిగిన నరపాల ♦ నిఖిలజనుల । యాపదలువాపి తండ్రిగా ♦ నరయఁగలవు॥ ౪౮

అప్యేకధేనోరపరాధచండా । ద్గురోః కృశానుప్రతిమాద్బిభేషి
శక్యోఽస్యమన్యుర్భవతావినేతుం । గాఃకోటిశఃస్పర్శయతాఘటోధ్నీః॥ ౪౯

తదక్షకల్యాణపరంపరాణాం । భోక్తారమూర్జస్వలమాత్మదేహం
మహీతలస్పర్శనమాత్రభిన్న । మృద్ధంహిరాజ్యంపదమైంద్రమాహుః॥ ౫౦

ఏతావదుక్త్వావిరతేమృగేంద్రే । ప్రతిస్వనేనాస్యగుహాగతేన
శిలోచ్చయోఽపిక్షితిపాలముచ్చైః । ప్రీత్యాతమేవార్థమభాషతేవ॥ ౫౧

నిశమ్యదేవానుచరస్యవాచం । మనుష్యదేవః పునరప్యువాచ
ధేన్వాతదధ్యాసితకాతరాక్ష్యా । నిరీక్ష్యమాణఃసుతరాందయాలుః॥ ౫౨

క్షతాత్కిలత్రాయత ఇత్యుదగ్రః । క్షత్రస్యశబ్దోభువనేషురూఢః
రాజ్యేనకింతద్విపరీతవృత్తేః । ప్రాణైరుపక్రోశమలీమసైర్వా॥ ౫౩

కథంనుశక్యోఽనునయోమహర్షే । ర్విశ్రాణనాచ్చాన్య పయస్వినీనాం
ఇమామనూనాంసురభేరవేహి । రుద్రౌజసాతుప్రహృతంత్వయాస్యాం॥ ౫౪

సేయంస్వదేహార్పణనిష్క్రయేణ । న్యాయ్యామయామోచయితుంభవత్తః
నపారణాస్యాద్విహతాతవైవం । భవేదలుప్తశ్చమునేఃక్రియార్థః॥ ౫౫

భవానపీదంపరవానవైతి । మహాన్హియత్నస్తవ దేవదారౌ
స్థాతుంనియోక్తుర్నహిశక్యమగ్రే । వినాశ్యరక్ష్యం స్వయమక్షతేన॥ ౫౬

కిమప్యహింస్యస్తవ చేన్మతోఽహం । యశఃశరీరేభవమేదయాలుః
ఏకాంతవిధ్వంసిషుమద్విధానాం । పిండేష్వనాస్థాఖలుభౌతికేషు॥ ౫౭

సంబంధమాభాషణపూర్వమాహు । ర్వృత్తఃసనౌసంగతయోర్వనాంతే
తద్భూతనాథానుగ నార్హసిత్వం । సంబంధినోమేప్రణయంవిహంతుం॥ ౫౮

తథేతిగాముక్తవతేదిలీపః । సద్యఃప్రతిష్టంభవిముక్తబాహుః
సన్యస్తశస్త్రోహరయేస్వదేహ । ముపానయత్పిండమివామిషస్య॥ ౫౯

తస్మిన్క్షణేపాలయితుఃప్రజానా । ముత్పశ్యతఃసింహనిపాతముగ్రం
అవాఙ్ముఖస్యోపరిపుష్పవృష్టిః । పపాతవిద్యాధరహస్తముక్తా॥ ౬౦

ఉత్తిష్ఠవత్సేత్యమృతాయమానం । వచోనిశమ్యోత్థితముత్థితఃసన్
దదర్శరాజాజననీమివస్వాం । గామగ్రతఃప్రస్రవిణీంనసింహం॥ ౬౧



శ్రీ

# రఘువంశము.

## పంచమాశ్వాసము.

---:o:---

### గీతములు.

విశ్వజిద్యాగ మొనరించి ♦ విత్తమెల్ల । వెచ్చపెట్టిన రఘుఁజేర ♦ వచ్చెఁ గౌత్సుఁ
డమలవరతంతు శిష్యుఁడౌ ♦ గమములెల్ల । నేర్చి గురుదక్షిణార్థంబు ♦ గూర్చుకొఱకు॥

స్వర్ణపాత్రము లేమి మృ♦త్పాత్రియందు । నఖిల పూజార్థసామగ్రి ♦ ననువుపఱిచి
బ్రహ్మతేజున కతిథికి ♦ భవ్యకీర్తి । యెదురుగాఁజనె నతిథుల ♦ నేలునృపతి॥ ౨

అత్తపోధను నుపవిష్టు ♦ నర్చఁజేసి । ధర్మకార్యజ్ఞుఁడును మాన♦ధనుఁడు రఘువు
దత్సమీపాసనంబునఁ ♦ దనరుచుండి । యంజలియొనర్చి యతనితో ♦ ననియెనిట్లు॥ 3

ఇనుఁడు జగతికిఁ జైతన్య ♦ మిడెడునట్లు । లఖిల విద్యలమీకిడి ♦ నట్టివాఁడు
మంత్రికర్తయు ఋషులలో ♦ మాన్యతముఁడు । నైనగురుఁడు సుఖుండె కు♦శాగ్రబుద్ధి॥

శక్రి మనమున ధైర్యంబు ♦ సడలఁజేసి । వాఙ్మనః కాయకర్మముల్ ♦ వదలకుండి
వర్తిలు ఋషీంద్రు త్రివిధ త♦పమ్మునందుఁ । గొఱఁత పడలేదుగా విఘ్న♦కోటివలన॥

ప్రోదిపెట్టుట నీరిడు ♦ టాదిక్రియల । సుతుని బ్రోచుటకంటెను ♦ నతిశయముగఁ
బెంప శ్రమఁదీర్చు నాశ్రమ ♦ వృక్షములకుఁ । గీడు మూడదుగా గాలిఁ ♦ గీలిపవన॥ ౬

తపఃయనుష్ఠానములకు సా♦ధనములైన । కుశలుదినినను నోర్తురు ♦ కూర్మమునులు
విడకతోడనుంత్రు బొడ్డులు ♦ పీడుదాఁక । యట్టిలేఁజింకలకు నిర్భ♦యంబెయచట॥ ౭

నిత్యవిధులగు స్నానాది ♦ కృత్యములకు । దోయిటనొసఁగు పితరుల ♦ తోయములకు
మునివిరచితోంఛషష్ఠాంశ ♦ పులినములకు । నెలవులౌ పుణ్యతీర్థమ్ము ♦ లలరుచున్నె॥ ౮

తనువులను బెంచుకొనుటకుఁ ♦ దఱినివచ్చు । నతిథులను బ్రోచుకొఱకు మీ♦రనువుపఱచు
వన్యఫలముల నీవార ♦ ధాన్యములను । బొట్టుదిన గ్రామ పశువులు ♦ బొక్కవుగద॥ ౯

అపిప్రసన్నేనమహర్షిణాత్వం । సమ్యగ్వినీయానుమతోగృహాయ
కాలోహ్యయంసంక్రమితుంద్వితీయం । సర్వోపకారక్షమమాశ్రమంతే॥ ౧౦

తవార్హతోనాభిగమేనతృప్తం । మనోనియోగక్రియయోత్సుకంమే
అప్యాజ్ఞయాశాసితురాత్మనావా । ప్రాప్తోసిసంభావయితుంవనాన్మామ్॥ ౧౧

ఇత్యర్ఘ్యపాత్రానుమితవ్యయస్య । రఘోరుదారామపిగాంనిశమ్య
స్వార్థోపపత్తింప్రతిదుర్బలాశ । స్తమిత్యవోచద్వరతంతుశిష్యః॥ ౧౨

సర్వత్రనోవార్తమవేహిరాజన్ । నాథేకుతస్త్వయ్యశుభంప్రజానాం
సూర్యేతపత్యావరణాయదృష్టేః । కల్పేతలోకస్యకథంతమిస్రా॥ ౧౩

భక్తిఃప్రతీక్ష్యేషుకులోచితాతే । పూర్వాన్మహాభాగతయాతిశేషే
వ్యతీతకాలస్త్వహమభ్యుపేత । స్త్వామర్థిభావాదితిమేవిషాదః॥ ౧౪

శరీరమాత్రేణనరేంద్రతిష్ఠ । న్నాభాసితీర్థప్రతిపాదితర్ద్ధిః
ఆరణ్యకోపాత్తఫలప్రసూతిః । స్తంబేననీవారఇవావశిష్టః॥ ౧౫

స్థానేభవానేకనరాధిపఃసన్ । నకించనత్వంమఖజంవ్యనక్తి
పర్యాయపీతస్యసురైర్హిమాంశోః । కలాక్షయఃశ్లాఘ్యతరోహివృద్ధేః॥ ౧౬

తదన్యతస్తావదనన్యకార్యో । గుర్వర్థమాహర్తుమహంయతిష్యే
స్వస్త్యస్తుతేనిర్గలితాంబుగర్భం । శరద్ఘనంనార్దతిచాతకోపి॥ ౧౭

ఏతావదుక్త్వాప్రతియాతుకామం । శిష్యంమహర్షేర్నృపతిర్నిషిధ్య
కింవస్తువిద్వన్గురవేప్రదేయం । త్వయాకియద్వేతితమన్వయుంక్త॥ ౧౮

తతోయథావద్విహితాధ్వరాయ । తస్మైస్మయావేశవివర్జితాయ
వర్ణాశ్రమాణాంగురవేసవర్ణీ । విచక్షణఃప్రస్తుతమాచచక్షే॥ ౧౯

సమాప్తవిద్యేనమయామహర్షి । ర్విజ్ఞాపితోభూద్గురుదక్షిణాయై
సమేచిరాయాస్ఖలితోపచారాం । తాంభక్తిమేవాగణయత్పురస్తాత్॥ ౨౦

నిర్బంధసంజాతరుషార్థకార్శ్య । మచింతయిత్వాగురుణాహముక్తః
విత్తస్యవిద్యాపరిసంఖ్యయామే । కోటీశ్చతస్రోదశచాహరేతి॥ ౨౧

సోహంసపర్యావిధిభాజనేన । మత్వాభవంతంప్రభుశబ్దశేషం
అభ్యుత్సహేసంప్రతినోపరోద్ధు । మల్పేతరత్వాచ్ఛ్రుతనిష్క్రయస్య॥ ౨౨

విద్దెలను నేర్చి గార్హస్థ్య ♦ విధికి మీకు । నాజ్ఞయిడినాఁడె ప్రీతితో ♦ నమ్మహర్షి
యఖిలలోకోపకారక ♦ మనఁగనొప్పు । తద్ద్వితీయాశ్రమమునకుఁ ♦ దగుగురిపుడు॥ ౧౦

అర్హతామీరరాఁగానె ♦ యగునె తృప్తి । మీనియుక్తంబు నెఱవేర్చి ♦ మించిగాక
నన్ను మాన్యునిజేయ న♦న్నమ్మునుండి । స్వయముగనొ లేక గురునాజ్ఞ ♦ వచ్చినావొ॥ ౧౧

అనఘు నుదారవాక్యమ్ము ♦ లాలకించి । యర్ఘ్యపాత్రింబెయతని వ్య♦యమ్ము దెల్ప
స్వార్థలాభంబునందు ని♦రాశఁజెంది । పలికె వరతంతు శిష్యుండు ♦ ప్రభునకిట్లు॥ ౧౨

అన్నిటను మానసేమంబె ♦ యనిపాల । పతివినీవుండఁ బ్రజ కశు♦భంబు గలదె
చిత్రభానుఁడు వెలుఁగఁగాఁ ♦ జీఁకటి యొటు । జనుల మాపులఁ గ్రమ్మంగఁ ♦ జాలుఁ జెపుమ॥

యోగ్యసత్కృతి నీవుఁ గు♦లోచితంబు । మించుమహిమను బూజ్యుల ♦ మించినావు
కాలమునతిక్రమించి నీ♦కడకు నిట్టు । లర్థిగా వచ్చినందుల ♦ కాత్మనగతు॥ ౧౪

పాత్రులకు నున్న దంతయుఁ ♦ బంచిపెట్టి । దేహమాత్రావశిష్టుఁడౌ ♦ దేవ నీవు
ఫలమునంతయు వనజన ♦ పాళికొసఁగి । కాలునీవారకాండంబుఁ ♦ బోలినావు॥ ౧౫

సార్వభౌముఁడనయ్యును ♦ సనసమునను । ధనవిహీనుఁడవౌట యెం♦తయును దగును
గ్రమముగా దేవతలచేతఁ ♦ ద్రాగఁబడును । క్షీణచంద్రుండె శ్లాఘ్యుఁడై ♦ చెలఁగుఁగాదె॥

గురువుగోరినదక్షిణ ♦ గూర్చుటకును । వేఱుపని సేయ ధనమన్య ♦ వేఁడఁబోదు
నీకుఁగల్గుత శుభములు ♦ నీరు లేని । శారదఘనంబుఁ గోరునే ♦ చాతకంబు॥ ౧౭

అనుమఁబోవఁగనున్న మ♦హర్షిశిష్యు । నాపి నగపతి యిట్లనె ♦ నతనితోడ
నెద్ది మతియెంత గురునకు ♦ నీయవలెనొ । తెల్పవే డెవ సచ్ఛీల ♦ ధీవిశాల॥ ౧౮

అనిశవిధివిహితంబుగా ♦ నధ్వరంబు । సలిపి గర్వంబు నొందక ♦ శాంతమతిని
సర్వవర్ణాశ్రమంబుల ♦ నిర్వహించు । రఘునకిట్లని తెల్పె నా ♦ బ్రహ్మచారి॥ ౧౯

విద్యనుముగించి గురునకు ♦ వినతి సల్పి । దక్షిణను గోరుమని వేఁడ ♦ దనకు భక్తి
సేనొనర్చిన సేవల ♦ నెల్ల నప్పు । డెన్న మొదలిడె మౌని ప్ర♦సన్నమతిని॥ ౨౦

ఒత్తి వేఁడిన నాగ్రహ ♦ యత్తుఁ డగుచు । ధనవిహీనుఁడ నేనౌటఁ ♦ దలఁపకుండ
విద్యకనురూపసంఖ్యయౌ ♦ విత్తమిమ్ము । పదియు నాలుగుకోట్లనెఁ ♦ బార్థివేంద్ర॥ ౨౧

అర్ఘ్యపాత్రంబుఁ జూచిన ♦ యంతలోనె । యీవు ప్రభుపదశేషుఁడం ♦ చెఱిఁగినేను
బ్రహ్మతను నిన్ను నిర్బంధ ♦ ప్రఱుపనైతి । విద్యవెలకొద్దిగావని ♦ వేద్యమగుట॥ ౨౨

ఇత్థం ద్విజేన ద్విజరాజకాంతి । రావేదితో వేదవిదాం వరేణ
ఏనోనివృత్తేంద్రియవృత్తిరేనం । జగాద భూయో జగదేకనాథః॥ ౨౩

గుర్వర్థమర్థీ శ్రుతపారదృశ్వా । రఘోః సకాశాదనవాప్య కామం
గతో వదాన్యాంతరమిత్యయం మే । మా భూత్పరీవాదనవావతారః॥ ౨౪

స త్వం ప్రశస్తే మహితే మదీయే । వసంశ్చతుర్థోఽగ్నిరివాగ్న్యగారే
ద్విత్రాణ్యహాన్యర్హసి సోఢుమర్హన్ । యావద్యతే సాధయితుం త్వదర్థం॥ ౨౫

తథేతి తస్యావితథం ప్రతీతః । ప్రత్యగ్రహీత్సంగరమగ్రజన్మా
గామాత్తసారాం రఘురప్యవేక్ష్య । నిష్క్రష్టుమర్థం చకమే కుబేరాత్॥ ౨౬

వసిష్ఠమంత్రోక్షణజాత్ప్రభావా । దుదన్వదాకాశమహీధరేషు
మరుత్సఖస్యేవ బలాహకస్య । గతిర్విజఘ్నే న హి తద్రథస్య॥ ౨౭

అథాధిశిశ్యే ప్రయతః ప్రదోషే । రథం రఘుః కల్పితశస్త్రగర్భం
సామంతసంభావనయైవ ధీరః । కైలాసనాథం తరసా జిగీషుః॥ ౨౮

ప్రాతః ప్రయాణాభిముఖాయ తస్మై । సవిస్మయాః కోశగృహే నియుక్తాః
హిరణ్మయీం కోశగృహస్య మధ్యే । వృష్టిం శశంసుః పతితాం నభస్తః॥ ౨౯

తం భూపతిర్భాసురహేమరాశిం । లబ్ధం కుబేరాదభియాస్యమానాత్
దిదేశ కౌత్సాయ సమస్తమేవ । పాదం సుమేరోరివ వజ్రభిన్నం॥ ౩౦

జనస్య సాకేతనివాసినస్తౌ । ద్వావప్యభూతామభినంద్యసత్త్వౌ
గురుప్రదేయాధికనిఃస్పృహోఽర్థీ । నృపోఽర్థికామాదధికప్రదశ్చ॥ ౩౧

అథోష్ట్రవామీశతవాహితార్థం । ప్రజేశ్వరం ప్రీతమనా మహర్షిః
స్పృశన్ కరేణానతపూర్వకాయం । సంప్రస్థితో వాచమువాచ కౌత్సః॥ ౩౨

కిమత్ర చిత్రం యది కామసూర్భూః । వృత్తే స్థితస్యాధిపతేః ప్రజానాం
అచింతనీయస్తు తవ ప్రభావో । మనీషితం ద్యౌరపి యేన దుగ్ధా॥ ౩౩

ఆశాస్యమన్యత్పునరుక్తభూతం । శ్రేయాంసి సర్వాణ్యధిజగ్ముషస్తే
పుత్రం లభస్వాత్మగుణానురూపం । భవంతమీడ్యం భవతః పితేవ॥ ౩౪

ఇత్థం ప్రయుజ్యాశిషమగ్రజన్మా । రాజ్ఞే ప్రతీయాయ గురోః సకాశం
రాజాపి లేభే సుతమాశు తస్మా । దాలోకమర్కాదివ జీవలోకః॥ ౩౫

అనుచు వేదవిదగ్రణి ♦ తనకుఁ దెలుపఁ । బాపములు వాయ నింద్రియ ♦ పాలినొప్పి
యిందుకాంతిని వెల్గు లో♦కైకవిభుఁడు । మాఱు పల్కెను దద్విప్ర♦మణికి నిట్లు॥ ౨౩

వేదపారంగతుండగు ♦ ద్విజుఁడు రఘుని । గురుని దక్షిణ కై డాసి ♦ కోర్కె గనమిఁ
గోరఁ జనె నన్యు ననియెడి ♦ క్రొత్తనింద । యుర్వి లోనన్ను నంటక ♦ యుండుఁ గాక॥ ౨౪

ప్రాజ్యపూజ్య మదీయాగ్ని ♦ భవనమందు । నధివసింపుఁడు నాల్గవ ♦ యగ్నివోలె
రెండుమూఁడు దినంబులు ♦ నిండు మదిని । జతన మొనరింతు మీ యభీ♦ప్సితముఁ దీర్ప॥ ౨౫

అనిన నౌఁగాక యనియుండె ♦ నచటమౌని । యతని ప్రతిన యమోఘమఁ♦చని యెఱింగి
భూమిని స్సారమగుటను ♦ భూవిభుండు । గోరె ధనమును లాగఁ గు♦బేరునుండి॥ ౨౬

అతని రథము వసిష్ఠుని ♦ యమలమంత్ర । ములను బ్రోక్షింపఁబడియుండుట ♦ జలధి శైల
గగనముల దాని కడ్డంబు ♦ గలుగ దెపుడు । గాలిఁ గూడిన మేఘంబు ♦ గతికిఁ బోలె॥ ౨౭

మహితుఁ గైలాసనాథు సా♦మంతుఁ గాఁగ । నెంచి బలమున నతని జ♦యింపఁ గోరి
రఘుఁడు ధీరుఁడు శస్త్రముల్ ♦ రథమునందుఁ । బెట్టి శయనించెను బ్రదోష♦వేళ యందు॥

తెల్లవాఱిన రఘుఁడంత ♦ నుల్లసిల్లి । వెడలనుండెడు సమయాన ♦ విస్మయంబు
మీఱ రక్షకు లరుదెంచి ♦ మింటనుండి । కోశమున స్వర్ణవర్షంబు ♦ గురిసె ననిరి॥ ౨౯

అంతఁ దానెత్తి పోనున్న ♦ యాకుబేరు । వలన లభియించి దేవేంద్రు ♦ వజ్రహతిని
బడిన మేరువు పాదంబు ♦ పగిది నొప్పు । స్వర్ణరాశిని మునికిచ్చెఁ ♦ బూర్ణముగను॥ ౩౦

గురుని కోర్కెకు నెక్కువ ♦ గొనఁడు ద్విజుఁడు । గోర్కెకెక్కువ యర్థికిఁ ♦ గూర్చె నృపుఁడు
వీరి యిర్వుర నిస్పృహా ♦ వృత్తి కలరి । పొగిడి రెంతయు సాకేత ♦ పురము ప్రజలు॥ ౩౧

వందలకొలంది నొంటెల ♦ వారువముల । ధనముఁ గొనిపోవ నిచ్చి య♦త్యంతభక్తి
వాల్చి తనపూర్వకాయమ్ము ♦ నిల్చినట్టి । యా రఘుని మౌని కరముల ♦ నంటి పలికె॥ ౩౨

రాజ్యతత్రస్థిరుండయి ♦ ప్రజల నేలు । స్వామి కోర్కెల భువి యిచ్చు ♦ క్షేమమెంత?
కామితమ్ముల దివి పితు ♦ కంగఁ జేయు । నీమహిమ సెన్న శక్యమే ♦ నృపవరేణ్య॥ ౩౩

అన్ని శుభములఁ బడసిన ♦ యధిప నీకు । వేఱు దీవెన పునరుక్తి ♦ విధము గానఁ
బూజ్యుఁడౌ నీవు తండ్రికిఁ ♦ బొడమినట్లు । పొడముఁ గావుత నీకు నీ♦బోటి సుతుఁడు॥ ౩౪

అనుచు రాజును దీవించి ♦ యగ్రజన్ముఁ । డాత్మగురువును జేరఁగా ♦ నరిగె నంతఁ
దద్వరంబున సుతుఁ గాంచె ♦ ధరణిధవుఁడు । గాంతి రవినుండి జీవులు ♦ గాంచునట్లు॥ ౩౫

బ్రాహ్మే ముహూర్తే కిల తస్య దేవీ । కుమారకల్పం సుషువే కుమారం
అతః పితా బ్రహ్మణ ఏవ నామ్నా । తమాత్మజన్మానమజం చకార॥ ౩౬

రూపం తదోజస్వి తదేవ వీర్యం । తదేవ నైసర్గికమున్నతత్వం
న కారణాత్స్వాద్బిభిదే కుమారః । ప్రవర్తితో దీప ఇవ ప్రదీపాత్॥ ౩౭

ఉపాత్తవిద్యం విధివద్గురుభ్య । స్తం యౌవనోద్భేదవిశేషకాంతం
శ్రీః సాభిలాషాపి గురోరనుజ్ఞాం । ధీరేవ కన్యా పితురాచకాంక్షే॥ ౩౮

అథేశ్వరేణ క్రథకైశికానాం । స్వయంవరార్థం స్వసురిందుమత్యాః
ఆప్తః కుమారానయనోత్సుకేన । భోజేన దూతో రఘవే విసృష్టః॥ ౩౯

తం శ్లాఘ్యసంబంధమసౌ విచింత్య । దారక్రియాయోగ్యదశం చ పుత్రం
ప్రస్థాపయామాస ససైన్యమేన । మృద్ధాం విదర్భాధిపరాజధానీం॥ ౪౦

తస్యోపకార్యారచితోపచారా । వన్యేతరా జానపదోపధాభిః
మార్గే నివాసా మనుజేంద్రసూనో । ర్బభూవురుద్యానవిహారకల్పాః॥ ౪౧

స నర్మదారోధసి సీకరార్ద్రై । ర్మరుద్భిరానర్తితనక్తమాలే
నివేశయామాస విలంఘితాధ్వా । క్లాంతం రజోధూసరకేతు సైన్యం॥ ౪౨

అథోపరిష్టాద్భ్రమరైర్భ్రమద్భిః । ప్రాక్సూచితాంతఃసలిలప్రవేశః
నిర్ధౌతదానామలగండభిత్తి । ర్వన్యస్సరిత్తో గజ ఉన్మమజ్జ॥ ౪౩

నిఃశేషవిక్షాళితధాతునాపి । వప్రక్రియామృక్షవతస్తటేషు
నీలోర్ధ్వరేఖాశబలేన శంసన్ । దంతద్వయేనాశ్మవికుంఠితేన॥ ౪౪

సంహారవిక్షేపలఘుక్రియేణ । హస్తేన తీరాభిముఖః సశబ్దం
బభౌ స భిందన్బృహతస్తరంగా । న్వార్యర్గళాభంగ ఇవ ప్రవృత్తః॥ ౪౫

శైలోపమః శైవలమంజరీణాం । జాలాని కర్షన్నురసా స పశ్చాత్
పూర్వం తదుత్పీడితవారిరాశిః । సరిత్ప్రవాహస్తటముత్ససర్ప॥ ౪౬

తస్యైకనాగస్య కపోలభిత్త్యో । ర్జలావగాహక్షణమాత్రశాంతా
వన్యేతరానేకపదర్శనేన । పునర్దిదీపే మదదుర్దినశ్రీః॥ ౪౭

సప్తచ్ఛదక్షీరకటుప్రవాహ । మసహ్యమాఘ్రాయ మదం తదీయం
విలంఘితాధోరణతీవ్రయత్నాః । సేనాగజేంద్రా విముఖా బభూవుః॥ ౪౮

అక్కుమారునిబోలిన ♦ యక్కుమారు । నమలబ్రాహ్మముహూర్తాన ♦ నతనిదేవి
గనెనుగావున బ్రహ్మకుఁ ♦ గాలునట్టి । యజుఁడనెడిపేరు రఘువిడె ♦ నాత్మజునకు॥ ౩౬

అదియెరూపంబు బలమును ♦ నదియె తేజ । మదియెస్వాభావికౌన్నత్య ♦ మదియెగుణము
కారణమునుండియింతయు ♦ మాఱఁడతఁడు । వరప్రదీపానఁబుట్టు దీ♦పంబు పగిది॥ ౩౭

విధివిహితరీతిగురులచే ♦ విద్యగాంచి । పూర్ణయౌవనకాంతిచేఁ ♦ బొలుచుచనజుని
జేరఁగోరియు రా లచ్చి ♦ ధీరయైన । కన్యవలెఁదండ్రియాజ్ఞకై ♦ కాచియుండె॥ ౩౮

భోజుఁడనుక్రథకైశిక ♦ రాజరత్న । మతనితోఁబుట్టువౌ యిందు ♦ మతికిజగగు
సుస్వయంవరమునరఘు ♦ సూనుదేఁగ । నంపె నొకదూతనాప్తుఁడై ♦ యలరువాని॥ ౩౯

అతనిసంబంధమెంతయు ♦ నర్హమంచుఁ । గొమరుఁ డుద్వాహమున కను♦కూలుఁడంచు
నమితసైన్యంబుతోరఘు ♦ వంపెనజునిఁ । దద్విదర్భాధిపతిరాజ♦ధాని కపుడు॥ ౪౦

అతఁడువిడుచోట్ల నిర్మిత ♦ మైనయట్టి । పటకుటీరాదికమ్ములు ♦ పరికరములు
పౌరజలకాన్కల వన్యభా♦వమును వీడ । నజునికారామకేళిగా ♦ నలరెఁబథము॥ ౪౧

దుమ్ముగవిసిన ధ్వజముల ♦ తోడఁగూడి । బడలియున్నట్టి సేనల ♦ విడియఁజేసె
నతఁడుచల్లనిగాలికి ♦ నల్లలాడు । కానుకగనొప్పునర్మదా ♦ క్రాంతతటిని॥ ౪౨

ఏఁచినదినుండిలేచె వ♦న్యేభమొకటి । మున్గుటనుమీఁది తుమ్మెదల్ ♦ ముందతెలుప
మదజలముపోయిశుభ్రమై ♦ పొదలు గండ।యుగము మజ్జనమొనరించి ♦ యుంటఁజూప॥

ధాతువులుపోయి శుభ్రమై ♦ దంతయుగము । చిత్రనీలోర్ధ్వరేఖలఁ ♦ జెలఁగుచుంట
ఋక్షవంతముతటుల ను♦త్క్రీడసల్ప । శిలలచేమొక్కపోయిన ♦ చెలువుఁదెలిపె॥ ౪౪

తుంగరవమునఁబొంగు త♦రంగములను । సారెసారెకుముడుచుచుఁ ♦ జాచుచుండు
తొండమునవచ్చితటిఁజేరు ♦ చుండుదంతి । బంధములుద్రెంచుకొనివచ్చు ♦ పగిదిఁదోఁచె॥

పర్వతముఁబోలు నక్కరి ♦ పామనాము । నుగముచేనూడ్చికొనివచ్చి ♦ యొడ్డుఁజేరి
నందుచేతనుగల్గిన ♦ యట్టివరద । ముందుగావచ్చితీరము ♦ నందుఁజేర॥ ౪౬

అప్పటికినీటఁదోఁగుట ♦ సాగియున్న । గండమదధార లావన♦గంధకరికిఁ
దత్పురగజాళిఁజూచిన ♦ తత్క్షణంబ । వర్షలక్ష్మిగ వృద్ధియై ♦ పాఱఁజొచ్చె॥ ౪౭

సప్తపర్ణపుఁబాల ట్ల♦సహ్యమైన । దానిమదజలగంధంబు ♦ సేనలోని
కరులుమూర్కొని మాఱుమొ♦గమ్మువెట్టి । పరువులిడె మావటీలకు ♦ వశముగాక॥ ౪౮

సచ్ఛిన్నబంధద్రుతయుగ్యశూన్యం । భగ్నాక్షపర్యస్తరథంక్షణేన
రామాపరిత్రాణవిహస్తయోధం । సేనానివేశంతుములంచకార॥ ౪౯

తమాపతంతంనృపతేరవధ్యో । వన్యఃకరీతిశ్రుతవాన్కుమారః
నివర్తయిష్యన్విశిఖేనకుంభే । జఘాననాత్యాయతకృష్టశార్ఙ్గః॥ ౫౦

సవిద్ధమాత్రఃకిలనాగరూప । ముత్సృజ్యతద్విస్మితసైన్యదృష్టః
స్ఫురత్ప్రభామండలమధ్యవర్తి । కాంతంవపుర్వ్యోమచరంప్రపేదే॥ ౫౧

అథప్రభావోపనతైఃకుమారం । కల్పద్రుమోత్థైరవకీర్యపుష్పైః
ఉవాచవాగ్మీదశనప్రభాభిః । సంవర్ధితోరస్థలతారహారః॥ ౫౨

మతంగశాపాదవలేపమూలా । దవాప్తవానస్మిమతంగజత్వం
అవేహిగంధర్వపతేస్తనూజం । ప్రియంవదంమాంప్రియదర్శనస్య॥ ౫౩

సచానునీతఃప్రణతేనపశ్చా । న్మయామహర్షిర్మృదుతామగచ్ఛత్
ఉష్ణత్వమగ్న్యాతపసంప్రయోగా । చ్ఛైత్యంహియత్సాప్రకృతిర్జలస్య॥ ౫౪

ఇక్ష్వాకువంశప్రభవోయదాతే । భేత్స్యత్యజఃకుంభమయోముఖేన
సంయోక్ష్యసేస్వేనవపుర్మహిమ్నా । తదేత్యవోచత్సతపోనిధిర్మాం॥ ౫౫

సంమోచితఃసత్త్వవతాత్వయాహం । శాపాచ్చిరప్రార్థితదర్శనేన
ప్రతిప్రియంచేద్భవతోనకుర్యాం । వృథాహిమేస్యాత్స్వపదోపలబ్ధిః॥ ౫౬

సంమోహనంనామసఖేమమాస్త్రం । ప్రయోగసంహారవిభక్తమంత్రం
గాంధర్వమాదత్స్వయతఃప్రయోక్తు । ర్నచారిహింసావిజయశ్చహస్తే॥ ౫౭

అలంహ్రియామాంప్రతియన్ముహూర్తం । దయాపరోభూఃప్రహరన్నపిత్వం
తస్మాదుపచ్ఛందయతిప్రయోజ్యం । మయిత్వయానప్రతిషేధరౌక్ష్యం॥ ౫౮

తథేత్యుపస్పృశ్యపయఃపవిత్రం । సోమోద్భవాయాఃసరితోనృసోమః
ఉదఙ్ముఖఃసోస్త్రవిదస్త్రమంత్రం । జగ్రాహతస్మాన్నిగృహీతశాపాత్॥ ౫౯

ఏవంతయోరధ్వనిదైవయోగా । దాసేదుషోఃసఖ్యమచింత్యహేతు
ఏకోయయౌచైత్రరథప్రదేశా । న్సౌరాజ్యరమ్యానపరోవిదర్భాన్॥ ౬౦

తంతస్థివాంసంనగరోపకంఠే । తదాగమారూఢగురుప్రహర్షః
ప్రత్యుజ్జగామక్రథకైశికేంద్ర । శ్చంద్రంప్రవృద్ధోర్మిరివోర్మిమాలీ॥ ౬౧

బంధములు ద్రెంచుకొని హరుల్ ♦ పరువులెత్తె । నిరుసులెడలి రథమ్ములు ♦ ధరణిఁ గూలె
సైనికులు దత్తరిల్లిరి ♦ సతులఁ గావ । క్షణములో శిబిరంబెల్ల ♦ సంచలించె॥ ౪౯

వనగజమ్ము నృపావధ్య ♦ మనుచు నెఱుఁగు । రాఘవుం డేచు కరిని మం♦రల్చుటకును
గుణము గొంచెమ్ముగా లాగి ♦ గురినిఁ జూచి । బాణమునఁ గొట్టె దానికుం♦భమ్ము దాఁక॥ ౫౦

తాఁకినంతనవన్యదం♦తావళంబు । రూపమును బాసి ఖేచర ♦ రూపమొందెఁ
జుట్టుధగధగదీప్తులు ♦ ముట్టి వెలుఁగ । శిబిరమునఁ జూచువారి క♦చ్చెరువుగాఁగ॥ ౫౧
స్వప్రభావంబుచేత సం♦ప్రాప్తమైన । సురతరుసుమాళిఁ జల్లి రా♦ట్సుతుని మీఁద
దంతకాంతులఁ దదురస్థ♦తారహార । దీప్తివర్ధిల్లఁ జేయుచుఁ ♦ దెలిపె నిట్లు॥ ౫౨

ఈమతంగజమైతి నే ♦ నామతంగు । శాపమున గర్వకారణ♦పాపమునను
దనరు ప్రియదర్శనాఖ్య గం♦ధర్వనాథుఁ । డతని సుతుఁడఁ బ్రియంవదుఁ ♦ డనెడువాఁడ॥

అంతఁ బతిమాలి నే మ్రొక్క ♦ నమ్మహర్షి । చిత్తమెంతయు దయచేత ♦ మెత్తనయ్యె
నుష్ణమంతయు నగ్నిసం♦యోగమునను । జలమునకుఁ జల్లదనము గా ♦ సహజగుణము॥ ౫౪

ఎన్నఁ డిక్ష్వాకుకులసము♦త్పన్నుఁ డజుఁడు । చీరు నీకుంభమును వాఁడి♦నారసమున
నాఁడు నీదివ్యతనువుతోఁ ♦ గూడఁగలవు । పొమ్మనియె నత్తపోనిధి ♦ పుణ్యజలధి॥ ౫౫

చిరముగాఁ గోరితిని నీదు ♦ దరిసెనమును । సత్త్వశాలివి నీచేత ♦ శాపమెడలె
నీకుఁ బ్రతికృతి చేయంగ ♦ నేర నేని । వ్యర్థముగఁ గాదె యీపద ♦ ప్రాప్తి నాకు॥ ౫౬

స్నేహితుఁడ! చూడు నాదు సం♦మోహనాస్త్ర । మిది ప్రయోగింపనరి నొవ్వఁ♦ డోడవు జయము
విడువ మరలింప మంత్రముల్ ♦ వేఱు వేఱు । దనరు గాంధర్వమిది గయి♦కొనుము దయను॥

చాలును ననుఁ గూర్చి లజ్జింప ♦ నేల నీకుఁ । గొట్టినప్పుడె దయను జూ♦పెట్టితీవు
గాన నా కోరికెను దో్రసి ♦ కఠినవృత్తిఁ । జూపఁ బోకుము నాయందు ♦ శుద్ధచరిత॥ ౫౭

అనిన నాఁగాక యని రాజ♦తనయుఁ డంత । నిర్మలంబగు నర్మదా ♦ నీరమునను
వారిచి యుదఙ్ముఖుండయి ♦ భక్తిఁ గొనియె । నస్త్రవిదుఁ డస్త్రమంత్రమ్ము ♦ లతని నుండి॥

ఇట్టులిర్వురదారి ని♦ర్హేతుకముగ । దైవయోగమ్ముచే మైత్రిఁ ♦ దనరి యంత
నొకరు చైత్రరథంబున ♦ కొకరు మంచి । రాజు చే రమ్యమగు విద♦ర్భకును జనిరి॥ ౬౦

అంత నగరోపకంఠమ్ము ♦ నజుఁడు సేరె । నని తెలిసి హర్షభరమున ♦ నవ్విదర్భ
నేత క్రథకైశికేశ్వరుఁ ♦ డెదురుకొనియె । సంద్రము పొంగునలలచేఁ ♦ జంద్రు నట్లు॥ ౬౧

ప్రవేశ్యచైనంపురమగ్రయాయీ । నీచైస్తథోపాచరదర్పితశ్రీః
మేనేయథాతత్రజనఃసమేతో । వైదర్భమాగంతుమజంగృహేశం॥ ౬౨

తస్యాధికారపురుషైఃప్రణతైఃప్రదిష్టాం
ప్రాగ్ద్వారవేదివినివేశితపూర్ణకుంభాం
రమ్యాంరఘుప్రతినిధిఃసనవోపకార్యాం
బాల్యాత్పరామివదశాంమదనోధ్యువాస॥ ౬౩

తత్రస్వయంవరసమాహృతరాజలోకం
కన్యాలలామకమనీయమజస్యలిప్సోః
భావావబోధకలుషాదయితేవరాత్రౌ
నిద్రాచిరేణనయనాభిముఖీబభూవ॥ ౬౪

తంకర్ణభూషణనిపీడితపీవరాంసం
శయ్యోత్తరచ్ఛదవిమర్దకృశాంగరాగం
సూతాత్మజాఃసవయసఃప్రథితప్రబోధం
ప్రాబోధయన్నుషసివాగ్భిరుదారవాచః॥ ౬౫

రాత్రిర్గతామతిమతాంవరముంచశయ్యాం
ధాత్రాద్విధైవననుధూర్జగతోవిభక్తా
తామేకతస్తవబిభర్తిగురుర్వినిద్ర
స్తస్యాభవానపరధుర్యపదావలంబీ॥ ౬౬

నిద్రావశేనభవతాప్యనవేక్షమాణా
పర్యుత్సుకత్వమబలానిశిఖండితేవ
లక్ష్మీర్వినోదయతియేనదిగంతలంబీ
సోపిత్వదాననరుచింవిజహాతిచంద్రః॥ ౬౭

తద్వల్గునాయుగపదున్మిషితేనతావత్
సద్యఃపరస్పరతులామధిరోహతాంద్వే
ప్రస్పందమానపరుషేతరతారమంత
శ్చక్షుస్తవప్రచలితభ్రమరంచపద్మం॥ ౬౮

వృంతాచ్ఛ్లథంహరతిపుష్పమనోకహానాం
సంసృజ్యతేసరసిజైరరుణాంశుభిన్నైః

నమ్రుఁడైముందునరుగుచు ♦ నగరమందుఁ । బ్రీతిరఘుపుత్త్రునజునిఁ బ్ర♦వేశ పెట్టి
సిరులనర్పించుభోజునిఁ ♦ బురమువార । లెంచి రతిథిగ నజుని గృ♦హేశుఁ గాఁగ॥ ౬౨

ఉ॥ మంగళపూర్ణకుంభచయ ♦ మండితవేదిని నొప్పుమోసలన్
రంగుదలిర్చునూత్నభవ♦నంబున రాజనియుక్తపూరుషుల్
వంగినమస్కరించి తెలు♦పన్ రఘుకల్పుఁడు సొచ్చి బాల్యమే
గంగను వచ్చుప్రాయమునఁ ♦ గంతుఁడువోలె వసించెవేడుకన్॥ ౬౩

చ॥ ధరణిపులన్ స్వయంవర వి♦ధానముచేసటు చేర్చినట్టి యా
సురుచిరకన్యకామణిని ♦ శుద్ధమతిన్ గనుకోర్కినున్న యా
నరవరుకన్నులన్ నిదుర ♦ నాఁటి నిశన్ గడుఁబ్రొద్దువోవఁగాఁ
దఱిసెనుభావమున్ గనక ♦ తాఁగలుషించిన కాంతకైవడిన్॥ ౬౪

ధృవకోకిల. అగలిపానుపుమీఁదరాలిన ♦ యంగరాగమువానిఁ జే
రెగుభుజంబులు పోగులంటు నృ♦పేంద్రసూను మహాత్మునిన్
దగువయస్కులు సూతపుత్త్రు లు♦దారవాఙ్నిచయంబులన్
నుగతినిట్టులు మేలుకొల్పిరి ♦ శుభ్రమైనయుపస్వనన్॥ ౬౫

మత్తకోకిల. రాత్రిపోయెను శయ్యవీడుము ♦ రాజపూజ్యమహామతీ
ధాత్రిభారము రెండుసేసెను ♦ ధాత వింటె శ్రియఃపతీ
చిత్రమందుభరించెనిద్రఁ ద్య♦జించినీగురుఁ డొక్కటిన్
బాత్రుఁ డీవు మఱొండుదాల్పఁగ ♦ భవ్యరూపరఘూపమా॥ ౬౬

ఉ॥ భద్రుఁడవైననీపయిని ♦ బద్మకునెంతటి మోహముండినన్
నిద్రకువశ్యుఁడై నిశిని ♦ నీవటులున్న నుపేక్షచేసి తా
రాద్రిముఁదాల్చి ఖండిత తె♦ఱంగుననెవ్వనితో వినోదమున్
దద్రిమసల్పె నాశశియుఁ ♦ దన్ముఖకాంతిని వీడిజారెడిన్॥ ౬౭

ఉత్సాహము. రెండునొక్కసారె రమ్య ♦ రీతి విచ్చి యిప్పుడే
నిండుగాసమానమాచు ♦ నింపుగాతమింపులన్
ఒండులోనమెదలుపాప ♦ యొండునీదుకన్ను వే
ఱొండులోఁజలించుభృంగ ♦ ముండునట్టిపద్మమున్॥ ౬౮

మ॥ భవదీయాననవాయువందలి స్వభా♦వంబైన సౌరభ్యమున్
వివిధాన్యైకగుణంబులంగలిపి గ♦ల్పింపంగ వాంఛించి యి

స్వాభావికంపరగుణేనవిభాతవాయుః
సౌరభ్యమీప్సురివతేముఖమారుతస్య॥ ౬౯

తామ్రోదరేషుపతితంతరుపల్లవేషు
నిర్ధౌతహారగులికావిశదంహిమాంభః
ఆభాతిలబ్ధపరభాగతయాధరోష్ఠే
లీలాస్మితంసదశనార్చిరివత్వదీయం॥ ౭౦

యావత్ప్రతాపనిధిరాక్రమతేనభాను
రహ్నాయతావదరుణేనతమోనిరస్తం
ఆయోధనాగ్రసరతాంత్వయివీరయాతే
కింవారిపూంస్తవగురుఃస్వయముచ్ఛినత్తి॥ ౭౧

శయ్యాంజహత్యుభయపక్షవినీతనిద్రాః
స్తంబేరమాముఖరశృంఖలకర్షిణస్తే
యేషాంవిభాంతితరుణారుణరాగయోగా
ద్భిన్నాద్రిగైరికతటాఇవదంతకోశాః॥ ౭౨

దీర్ఘేష్వమీనియమితాఃపటమండలేషు
నిదాంవిహాయవనజాక్షవనాయుదేశ్యాః
వక్త్రోష్మణామలినయంతిపురోగతాని
లేహ్యానిసైంధవశిలాశకలానివాహాః॥ ౭౩

భవతివిరళభక్తిర్మ్లానపుష్పోపహారః
స్వకిరణపరివేషోద్భేదశూన్యాఃప్రదీపాః
అయమపిచగిరంనస్త్వత్ప్రబోధప్రయుక్తా
మనువదతిశుకస్తేమంజువాక్పంజరస్థః॥ ౭౪

ఇతివిరచితవాగ్భిర్వందిపుత్రైఃకుమారః
సపదివిగతనిద్రస్తల్పముజ్ఝాంచకార
మదపటునినదద్భిర్బోధితోరాజహంసైః
సురగజఇవగాంగంసైకతంసుప్రతీకః॥ ౭౫

అథవిధిమవసాయ్యశాస్త్రదృష్టం
దివసముఖోచితమంచితాక్షిపక్ష్మా

బ్బవి వృక్షంబులనుండి జారిపడు నా ♦ పూలం బ్రభాతానిలం
బవధానంబున బాలసూర్యకరభి ♦ న్నాబ్జాళితోఁ గూర్చెడిన్॥ ౧౯

ఉ॥ క్రొంజిగియాణిముత్తెములకున్ సరిమించెడు మంచుబిందువుల్
కెంజిగురాకులం బోలుచు ♦ లీలలు చూడఁగఁ గ్రిందివాతెఱన్
రంజిలుదంతకాంతులప ♦ రంపరఁ గూడి వెలుంగుచుండు నీ
మంజుతరస్మితంబులను ♦ మానక తెల్పు నరేంద్రనందనా॥ ౨౦

ఉ॥ ఆకసమున్ బ్రతాపనిధి ♦ యర్కుఁడు చేరక మున్నె చీఁకటిన్
వీఁక ననూరుఁ డెంతయును ♦ వే యెగజిమ్మెను వీరకోటిలోఁ
బ్రాకట నాయకుండవయి ♦ భాసిలుచుండఁగ నీవు వైరులన్
దాఁకి వధించు నేలొకో ర♦ణస్థలి నీజనకుండు రాఘవా॥ ౨౧

చ॥ ఇరుగడనిద్రదీరికరు ♦ లెంతయు మ్రోగుచునుండ సంకిళుల్
తొలఁగెను సెజ్జ నంత నటఁ ♦ దోఁచినసూర్యుని రక్తరశ్మిచే
నరుణతరప్రభాతతుల ♦ నందిన యగ్గజదంతకోశముల్
వఱలెను గైరికాద్రితటి ♦ వ్రచ్చినకైవడి నింపునించుచున్॥ ౨౨

చ॥ నిసుపుగఁగట్టినట్టి పట♦నిర్మితమండపపాళియందుఁ బెం
పడరెడు పారసీకతుర♦గావళి నిద్రనుబాపి ముందు సా
పడనిడినట్టి సైంధవపుఁ ♦ బల్కులనెల్లను నోటియావిరిన్
గడుమలినంబు సేసెడిని ♦ గన్గొను మో యరవిందలోచనా॥ ౨౩

ఉ॥ పాడుటచేఁ గడున్ శిథిల♦భావముఁ గాంచె సుమోపహారముల్
వీడెను దీప్తిమండలము ♦ వెగ్గెడుదివ్వెల నీవు మేలుకో
నాడెడు మానువాక్యముల ♦ కందము గాఁబ్రతిఁబల్కు ముద్దుమా
ట్లాడుచుఁ బంజరమ్మున వి♦హారము సల్పెడు నీదుకీరమున్॥ ౨౪

ఉ॥ వందికుమారు లిప్పగిది ♦ వాగ్విభవంబులు చూపిలేపఁగాఁ
జెందినవేడ్కనంచలు ర♦చించెడు శబ్దముచేత లేచి యా
నందముతోడ గాంగపులి♦నంబులవీడెడు సుప్రతీక మ
ట్లొందిన ప్రీతి మేల్కొని న♦రోత్తమసూతి తొలంగెఁ దల్పమున్॥ ౨౫

ఉ॥ అంతఁబ్రభాతకృత్యముల ♦ నన్నియుఁ దీర్చి యథావిధిజ్ఞతన్
గాంతములైన రెప్పలను ♦ గ్రాలుకనుంగవ యొప్పనయ్యుజుం

కుశలవిరచితానుకూలవేషః
క్షితిపసమాజమగాత్స్వయంవరస్థం॥ ౭౬

ఇతి శ్రీరఘువంశే మహాకావ్యే కాళిదాసకృతౌ వజస్వయంవరాభి
గమనో నామ పంచమఃసర్గః.



డెంతయు దత్తు లర్థిరచి ♦ యించిన వేషముఁబూనిచేరె భూ
కాంతులు దత్స్వయంవరపుఁ ♦ గాంతునుగూడిన యాసభాస్థలిన్॥ ౭౬

గద్య.

ఇది శ్రీపరమేశ్వరకరుణాఫలిత లలితకవితాకలిత శ్రీరామలక్ష్మాంబా
బుచ్చివేంకయామాత్యతనూజాత సకలసజ్జనవిధేయ ఆదిపూడి
సోమనాధనామధేయప్రణీతంబయిన యాంధ్రరఘువం
శంబునందు నజస్వయంవరాభిగమనంబను
పంచమాశ్వాసము సంపూర్ణము.





శ్రీ

# రఘువంశమ్

## షష్ఠః సర్గః

—:o:—

సతత్ర మంచేషు మనోజ్ఞ వేషాన్ । సింహాసనస్థా నుపచారవత్సు
వైమానికానాం మరుతా మపశ్య । దాకృష్టలీలా న్నరలోక పాలాన్॥ ౧

రతే ర్గృహీతానునయేన కామం । ప్రత్యర్పిత స్వాంగ మివేశ్వరేణ
కాకుత్స్థ మాలోకయతాం నృపాణాం । మనో బభూవేందుమతీ నిరాశం॥ ౨

వైదర్భ నిర్దిష్ట మసౌ కుమారః క్లృప్తేనసోపాన పథేన మంచం
శిలావిభంగై ర్మృగరాజ శాబ । స్తుంగం నగోత్సంగ మివారురోహ॥ ౩

పరార్ధ్యవర్ణా స్తరణోపపన్న । మాసేదివాన్ రత్నవదాసనం సః
భూయిష్ఠమాసీ దుపమేయకాంతి । ర్మయూర పృష్ఠాశ్రయిణాగుహేన॥ ౪

తాసు శ్రియా రాజపరంపరాసు । ప్రభావిశేషోదయదుర్నిరీక్ష్యః
సహస్రధాత్మా వ్యరుచద్విభక్తః । పయోముచాం పంక్తిషు విద్యుతేవ॥ ౫

తేషాం మహార్హాసన సంస్థితానా । ముదారనేపథ్య భృతాం సమధ్యే
రరాజధామ్నా రఘుసూను రేవ । కల్పద్రుమాణా మివ పారిజాతః॥ ౬

నేత్రవ్రజాః పౌరజనస్య తస్మిన్ । విహాయ సర్వా న్నృపతీ న్నిపేతుః
మదోత్కటే రేచిత పుష్పవృక్షా । గంధద్విపే వన్యఇవ ద్విరేఫాః॥ ౭

అథస్తుతే వందిభి రన్వయజ్ఞైః । సోమార్కవంశ్యే నరదేవలోకే
సంచారితే చాగురుసారయోనౌ । ధూపే సముత్సర్పతి వైజయంతీః॥ ౮

పురోపకంఠోపవనాశ్రయాణాం । కలాపినా ముద్ధతనృత్యహేతౌ
ప్రధ్మాతశంఖే పరితో దిగంతాం । స్తూర్యస్వనే మూర్ఛతి మంగళార్థే॥ ౯



శ్రీ

# ర ఘు వం శ ము.

## ష ష్ఠా శ్వా స ము.

———:o:———

### గీతములు.

దివి విమానాళి విహరించు ♦ దివిజవరుల । లీలలను గ్రాలి పర్యంక ♦ పాళిమీఁద
సింహపీఠములందుండి ♦ చెలఁగు నృపుల । రమ్యవేషుల నటఁ గాంచె ♦ రఘుని సుతుఁడు॥ ౧

హరుని రతికాంత వేఁడఁగా ♦ నతనికరుణ । మరల దేహంబు దాల్చిన ♦ మరుఁడనంగ
నొప్పు కాకుత్స్థమణిఁ గాంచి ♦ యుర్విపాలు । రిందుమతిఁ గూర్చి నిరాశఁ ♦ జెందిరంత॥

ఱాళ్లపై ఱాళ్లమీఁదుగా ♦ రమ్యశిఖరి । శిఖరమెక్కెడు సింహంపు ♦ శిశువు వోలె
నవ్విదర్భాధిపతి చూప ♦ నక్కుమార । విభుఁడు మెట్టులమీఁదుగాఁ ♦ బీఠమెక్కె॥ ౩

రత్నకంబళ రాజిచేఁ ♦ బ్రభ దలిర్చు । నాసనంబునఁ గూర్చున్న ♦ యయ్యజుండు
చిత్రకాంతుల నెమ్మిపైఁ ♦ జెలఁగుచుండు । స్కందుతోఁ బోల్ప నెంతయుఁ ♦ జాలియుండె॥

అంబుదాళిని వేరూపు ♦ లంది మెఱపు । చెలఁగి కనులకు మిఱుమిట్లు ♦ గొలుపునట్లు
రాజపంక్తుల రాజిల్లు ♦ రాజ్యలక్ష్మి । యధిక కాంతిని దుస్సహ ♦ మయ్యెఁ జూడ॥ ౫

శ్రేష్ఠ సింహాసనంబులఁ ♦ జెన్నుమీఱి । యుజ్జ్వలంబగు వేషాల ♦ నొప్పియున్న
రాజులందఱిలో రఘు ♦ రాజసుతుఁడె । సురతరులఁ బారిజాతంబు ♦ కరణి మెఱసె॥ ౬

భృంగముల్ పుష్పవృక్షమ్ము ♦ లెల్లఁ బాసి । వచ్చి మదగంధ గజముపై ♦ వ్రాలినట్లు
పౌరజనముల సకలదృగ్ ♦ వ్రాతములును । బాసి రాజుల నజునిపై ♦ వచ్చివ్రాలె॥ ౭

సోమసూర్యకులంబుల ♦ భూమిపతుల । వంశచరితలు దెలిసిన ♦ వందితతులు
పాఠములు సల్ప నగరుధూ ♦ పమ్ములడరి । పర్వి చుట్టును ధ్వజముల ♦ పయికి నెగసె॥ ౮

శంఖమంగళతూర్య ని ♦ స్స్వానచయము । కడలకును ముట్టియంతటఁ ♦ గలసి నెఱయ
నగర కంఠోపవనముల ♦ నెగడుచుండు । నెమళులకు నృత్యహేతువై ♦ యమరె నపుడు॥ ౯

మనుష్యవాహ్యం చతురస్రయాన । మధ్యాస్య కన్యా పరివారశోభి
వివేశ మంచాంతర రాజమార్గం । పతింవరా క్లృప్త వివాహవేషా॥ ౧౦

తస్మిన్విధానాతిశయే విధాతుః । కన్యామయే నేత్రశతైక లక్ష్యే
నిపేతు రంతఃకరణై ర్నరేంద్రా । దేహైః స్థితాః కేవలమాసనేషు॥ ౧౧
తాంప్రత్యభివ్యక్త మనోరథానాం । మహీపతీనాం ప్రణయాగ్రదూత్యః
ప్రవాళశోభా ఇవపాదపానాం । శృంగారచేష్టా వివిధా బభూవుః॥ ౧౨
కశ్చిత్కరాభ్యా ముపగూఢనాళ । మాలోల పత్రాభి హతద్విరేఫం
రజోభిరంతః పరివేషబంధి । లీలారవిందం భ్రమయాం చకార॥ ౧౩
విస్రస్త మంసా దపరోవిలాసీ । రత్నానువిద్ధాం గదకోటిలగ్నం
ప్రాలంబ ముత్కృష్య యథావకాశం । నినాయ సాచీకృత చారువక్త్రః॥ ౧౪
ఆకుంచితాగ్రాంగులినా తతోన్యః । కించిత్స మావర్జిత నేత్రశోభః
తిర్యగ్విసంసర్పి నఖప్రభేణ । పాదేనహైమం విలిలేఖ పీఠం॥ ౧౫
నివేశ్యవామం భుజమాసనార్ధే । తస్మిన్నివేశాదధికోన్నతాంసః
కశ్చిద్వివృత్త త్రికభిన్నహారః । సుహృత్సమాభాషణతత్పరోభూత్॥ ౧౬
విలాసినీ విభ్రమదంతపత్ర । మాపాండురం కేతకబర్హ మన్యః
ప్రియానితంబోచిత సంనివేశై । ర్విపాటయామాస యువానఖాగ్రైః॥ ౧౭
కుశేశయా తామ్రతలేన కశ్చిత్ । కరేణరేఖా ధ్వజలాంఛనేన
రత్నాంగులీయ ప్రభయానువిద్ధా । నుదీరయామాస సలీలమక్షాన్॥ ౧౮
కశ్చిద్యథాభాగ మవస్థితోపి । స్వసంనివేశా ద్వ్యతిలంఘినీవ
వజ్రాంశుగర్భాంగులి రంధ్రమేకం । వ్యాపారయామాస కరం కిరీటే॥ ౧౯
తతోనృపాణాం శ్రుతవృత్తవంశా । పుంవత్ప్రగల్భా ప్రతిహార రక్షీ
ప్రాక్సన్నికర్షం మగధేశ్వరస్య । నీత్వా కుమారీ మవదత్సునందా॥ ౨౦
అసౌశరణ్యః శరణోన్ముఖానా । మగాధసత్త్వో మగధప్రతిష్ఠః
రాజాప్రజా రంజనలబ్ధవర్ణః । పరంతపోనామ యథార్థనామా॥ ౨౧
కామం నృపాః సంతు సహస్రశోన్యే । రాజన్వతీ మాహు రనేన భూమిం
నక్షత్రతారా గ్రహసంకులాపి । జ్యోతిష్మతీ చంద్రమసైవ రాత్రిః॥ ౨౨

పరిచరులతోడ నొప్పి వి♦వాహవేష । కలితయైన పతింవర ♦ కన్య నరులు
మోయుపల్లకినెక్కి ప్రి ♦ మోదమతిని । రాజపర్యంకమధ్యమా ♦ గ్గమునుజొచ్చె॥ ౧౦

పందలకొలంది వీక్షణ ♦ వార్తిములకు । గుఱియగుచు బ్రహ్మసృష్టి న ♦ బ్బురమునగుచు
నెసఁగునాకన్నె పైవ్రాలె ♦ నృపులమనము । లంగములుమాత్రముండె సిం♦హాసనముల॥ ౧౧

ఆమెయందలి తమప్రేమ ♦ వ్యక్తపఱుచు । భూతలేంద్రుల ప్రణయాగ్రి ♦ దూతలనఁగ
వివిధ శృంగార చేష్టలు ♦ వెలసెనపుడు । సృత్తములయందుఁ బల్లవ ♦ శ్రీలువోలె॥ ౧౨

కదలిరేకులు తేంట్లను ♦ గడకునెట్ట । వరపరాగంబు లోపలఁ ♦ బరిధిగట్ట
నాళమును జేతఁబట్టి భూ ♦ నాథుఁడొక్కఁ । డందముగఁ ద్రిప్పె లీలార♦విందమపుడు॥

వేఱొకవిలాసి పూదండ ♦ జారిభుజము । రత్నఖచితవరాంగదా ♦ గ్రమునఁ దగులు
కొనిన సుందరముఖమును ♦ గొంతత్రిప్పి । దానిసవరించి యిడె యథా ♦ స్థానమందు॥

మఱియొకఁడు గొంతవెనుకకుఁ ♦ బఱపిదృష్టి । కాళ్లమునివ్రేళ్ళువంచి బం ♦ గారుపాద
పీఠమును వ్రాయుచుండెను ♦ విమలనఖర । వక్రికాంతులు దానిపైఁ ♦ బర్వుచుండ॥ ౧౫

మించియెత్తుగ మూపు గా ♦ న్పించురీతి । వామభుజముంచి పీఠార్ధ ♦ భాగమందు
విరిసరముజారనొకయుంత ♦ వెన్నుద్రిప్పి । యొకఁడుమాట్లాడఁగడఁగెను ♦ సకునితోడ॥

మఱియొకఁడు స్వప్రియాంగన ♦ పిఱుఁదుమీఁద । నునుచుకొనగోటఁ గామినీ♦జనవిలాస
మునకునొ దంతపత్త్రిళి ♦ కనువుగాఁగఁ । బచ్చగేదంగిరేకును ♦ బట్టిచీల్చె॥ ౧౭

ధ్వజముమొదలగు రేఖలఁ ♦ దనరుచుండి । పద్మమ ట్లెఱ్ఱగానుండు ♦ పాణితోడ
రత్నముల యుంగరమ్ముల ♦ ప్రభలుగ్రమ్మ । పాచికలు వైచె నొక్కండు♦పార్థివుండు॥

తలనుయుక్తస్థలంబునఁ ♦ దనరుచున్న । మకుట మొక్కఁడు దలఁగిన ♦ మాడ్కిదాని
నంటఁజొచ్చెను గరమున ♦ నక్కిరీట । వజ్రరుచి వ్రేళ్ళసందులఁ ♦ బడివెలుంగ॥ ౧౯

అంత రాడ్వంశచరితంబు ♦ లన్నివెలసి ♦ పురుషులంతటిపొర్థియై ♦ వఱలుచుండు
ద్వారపాలసునంద త♦త్కన్యనపుడు । తోలుతమగధేశుకడనిల్పి ♦ పలికెనిట్లు॥ ౨౦

అమితసత్త్వుఁడు మగధర♦త్నాస్పదుండు । శరణుజొచ్చినవారికి ♦ శరణమగుచుఁ
బ్రజలరంజింపఁజేసెడు ♦ భవ్యయశుఁడు । సార్థకపరంతపాఖ్యుఁ డీ♦క్ష్మావరుండు॥ ౨౧

పృథ్వివరులన్యులున్నను ♦ వేలకొలఁదిఁ । నితఁడురాజన్వతినిజేసె ♦ క్షితితలమును
లెక్కలేనన్నిగ్రహములు ♦ చుక్కలున్న । నిశినిజ్యోతిష్మతినిజేయు ♦ శశివిధమున॥ ౨౨

క్రియాప్రబంధా దయమధ్వరాణా । మజస్రమాహూత సహస్రనేత్రః
శచ్యాశ్చిరం పాండుకపోలలంబాన్ । మందారశూన్యా నలకాం శ్చకార॥ ౨౩

అనేనచేదిచ్ఛసి గృహ్యమాణం । పాణిం వరేణ్యేన కురుప్రవేశే
ప్రాసాదవాతాయన సంశ్రితానాం । నేత్రోత్సవం పుష్పపురాంగనానాం॥ ౨౪

ఏవంతయోక్తే తమవేక్ష్యకించిత్ । విస్రంసి దూర్వాంక మధూకమాలా
ఋజుప్రణామ క్రియయైవతన్వీ । ప్రత్యాదిదేశైన మభాషమాణా॥ ౨౫

తాం సైవవేత్ర గ్రహణే నియుక్తా । రాజాంతరం రాజసుతాం నినాయ
సమీరణోత్థేవ తరంగరేఖా । పద్మాంతరం మానసరాజహంసీం॥ ౨౬

జగాదచైనా మయమంగనాథః । సురాంగనా ప్రార్థిత యౌవనశ్రీః
వినీతనాగః కిలసూత్రకారై । రైంద్రం పదం భూమిగతోపి భుంక్తే॥ ౨౭

అనేనపర్యాస యతాశ్రు బిందూన్ । ముక్తాఫలస్థూల తమాన్ స్తనేషు
ప్రత్యర్పితాః శత్రువిలాసినీనా । మున్ముచ్యసూత్రేణ వినైవహారాః॥ ౨౮

నిసర్గభిన్నాస్పద మేకసంస్థ । మస్మిన్ద్వయం శ్రీశ్చ సరస్వతీచ
కాంత్యాగిరా సూనృతయాచ యోగ్యా । త్వమేవకల్యాణి తయోస్తృతీయా॥ ౨౯

అథాంగరాజా దవతార్యచక్షు । ర్యాహీతి జన్యా మవదత్కుమారీ
నాసౌనకామ్యో నచవేదసమ్య । గ్ద్రష్టుంనసా భిన్నరుచిర్హిలోకః॥ ౩౦

తతఃపరం దుఃప్రసహం ద్విషద్భి । ర్నృపం నియుక్తా ప్రతిహారభూమౌ
నిదర్శయామాస విశేషదృశ్య । మిందుం నవోత్థాన మివేందుమత్యై॥ ౩౧

అవంతినాథోయ ముదగ్రబాహు । ర్విశాలవక్షా స్తనువృత్తమధ్యః
ఆరోప్యచక్ర భ్రమ ముష్ణతేజా । స్త్వష్ట్రేవ యత్నోల్లిఖితోవిభాతి॥ ౩౨

అస్యప్రయాణేషు సమగ్రశక్తే । రగ్రేసరై ర్వాజిభి రుత్థితాని
కుర్వంతిసామంత శిఖామణీనాం । ప్రభాప్రరోహా స్తమయం రజాంసి॥ ౩౩

అసౌమహాకాల నికేతనస్య । వసన్నదూరే కిల చంద్రమౌళేః
తమిస్రపక్షేపి సహప్రియాభి । ర్జ్యోత్స్నావతో నిర్విశతిప్రదోషాన్॥ ౩౪

అనేనయూనా సహపార్థివేన । రంభోరుకచ్చి న్మనసోరుచిస్తే
సిప్రాతరంగానిల కంపితాసు । విహర్తుముద్యాన పరంపరాసు॥ ౩౫

ఎడతెగక జన్నములు సేసి ♦ యెపుడు నింద్రుఁ । బిల్చి శచివెల్లచెక్కిళ్ల ♦ వ్రేలునట్టి
ముంగురులయందు మందార ♦ పుష్పచయము । చేరకుండఁగఁజేసెను ♦ జిరమితండు॥

ఈవరేణ్యునిచేపట్టు ♦ దేని నీవు । బుష్పపురమును జొచ్చి యా ♦ పురములోని
యమలప్రాసాదవాతాయ ♦ నములఁజూచు । చానలకు నేత్రపర్వంబు ♦ సలుపఁగలవు॥

అనుచుఁజెప్పినవాలించి ♦ యతనిఁగాంచి । గరికెతోనొప్పు నిప్పుపూ ♦ సరముగదల
బుజగతినిగ్రాలుమతి నమ ♦ స్కృతినొనర్చి । తన్వి మానముతోడ నా ♦ తనిఁదొలంగె॥

మానసమరాళినొండు ప♦ద్మమునుజేర్చు । గాలిచేఁగల్గుతరఁగల ♦ పాళిపగిది
రాజపుత్రిని మఱియొక ♦ రాజుఁజేర్చి । యనియె వేత్రమ్ము దాల్చిన ♦ యానునంద॥ ౨౭

అంగనాథుఁడితండు సు♦రాంగనాళి । కోరుయౌవనకాంతిఁ జె♦న్నారువాఁడు
గజములకుశిక్ష బుషులచేఁ ♦ గఱపినాఁడు । ధరణిపైనింద్రవిభవంబు ♦ దాల్చినాఁడు॥

అశ్రుబిందులు ముత్తెమ్ము ♦ లంతలేసి । వైరికాంతలచనులపైఁ ♦ బ్రస్తరించి
యితఁడుమున్గొన్నసరులకుఁ ♦ బ్రతిగనిడిన । హారములులేనివండల ♦ తీరుగొలిపె॥ ౨౮

భిన్నవాసస్వభావలై ♦ యున్న నిటను । శ్రీసరస్వతులిర్వురుఁ ♦ జేరిరొకట
సత్యవాక్పూతసౌందర్య ♦ శాలివీవు । గూడియుంటకు యోగ్యవు ♦ మూఁడవదిగ॥ ౨౯

అనుడునాతనిపైదృష్టి ♦ నట్టెదింపి । పదయనుచుఁజెప్పెఁజెలికి న ♦ ప్రభుకుమారి
తానెఱుంగఁగఁజాలదా? ♦ తగఁడయతఁడు । అవనినభిరుచి భిన్నమా ♦ నంతెగాక॥ 3౦

అంత దౌవారికసునంద ♦ యరితతులకు । దుష్ప్రసహ్యుని నూత్న చం♦ద్రుండువోలెఁ
జూడనెంతయు యోగ్యుని ♦ సుభగునృపుని । నింకొకనిఁజూపి యిట్లనె♦నిందుమతికి॥ 3౧

నిడుదలైనట్టిబాహువుల్ ♦ వెడఁదరొమ్ము । గుండ్రమౌసన్ననడుమును ♦ గొమరుమిగులఁ
ద్వష్ట్రచక్రభ్రమంబుపైఁ ♦ దవిలిరాయ । వఱలురవిఁబోలునీతఁ డ♦వంతివిభుఁడు॥ 3౨

శక్తిసంపూర్ణునీతని ♦ జైత్రయాత్ర । ముందునడిచెడుహరితతిఁ ♦ బొడమురజము
లఖిలసామంతరాజ తే♦జాంకురముల । కస్తమానంబుగల్పించు ♦ నద్భుతముగ॥ 33

అమ్మహాకాలనిలయు శ♦శాంకమౌళి । కెలనవసియించుఁగావునఁ ♦ గృష్ణపక్ష
మందుఁగూడను దనప్రియు ♦ రాండ్రతోడ । ననుభవించునుజంద్రికా ♦ యామినులను॥

ఈపడుచు తేనితోఁగూడి ♦ యింపుమీఱ । విమలసిప్రాతరంగాళి ♦ వెడలుగాలి
వలనఁగంపించునుద్యాన ♦ పాళియందుఁ । జెలఁగఁగోరుదె రంభోరు ♦ తెలుపుమనిన॥ 3౪

తస్మిన్నభిద్యోతిత బంధుపద్మే । ప్రతాపసంశోషిత శత్రుపంకే
బబంధసానోత్తమ సౌకుమార్యా । కుముద్వతీ భానుమతీవ భావమ్॥ ౩౬

తాం మగ్రతస్తామర సాంతరాభా । మనూపరాజస్య గుణైరనూనామ్
విధాయసృష్టిం లలితాం విధాతు । ర్జగాద భూయః సుదతీం సునందా॥ ౩౭

సంగ్రామనిర్విష్ట సహస్రబాహు । రష్టాదశద్వీప నిఖాత యూపః
అనన్యసాధారణ రాజశబ్దో । బభూవయోగీ కిల కార్తవీర్యః॥ ౩౮

అకార్యచింతా సమకాలమేవ । ప్రాదుర్భవం శ్చాపధరః పురస్తాత్
అంతః శరీరేష్వపియః ప్రజానాం । ప్రత్యాదిదేశా వినయం వినేతా॥ ౩౯

జ్యాబంధ నిష్పంద భుజేనయస్య । వినిఃశ్వసద్వక్త్ర పరంపరేణ
కారాగృహే నిర్జితవాసవేన । లంకేశ్వరే ణోషిత మాప్రసాదాత్॥ ౪౦

తస్యాన్వయే భూపతిరేష జాతః । ప్రతీప ఇత్యాగమ వృద్ధసేవీ
యేనశ్రియః సంశ్రయదోషరూఢం । స్వాభావలోలేత్యయశః ప్రమృష్టం॥ ౪౧

ఆయోధనే కృష్ణగతిం సహాయ । మవాప్యయః క్షత్రియ కాలరాత్రిం
ధారాంశితాం రామపరశ్వధస్య । సంభావయ త్యుత్పలపత్రసారాం॥ ౪౨

అస్యాంకలక్ష్మీ ర్భవ దీర్ఘబాహో । ర్మాహిష్మతీ వప్రనితంబకాంచీం
ప్రాసాదజాలై ర్జలవేణిరమ్యాం । రేవాంయది ప్రేక్షితు మస్తికామః॥ ౪౩

తస్యాః ప్రకామం ప్రియదర్శనోపి । నసక్షితీశో రుచయే బభూవ
శరత్ప్రమృష్టాంబుధరోపరోధః । శశీవపర్యాప్త కలోనలిన్యాః॥ ౪౪

సాశూరసేనాధిపతిం సుషేణ । ముద్దిశ్యలోకాం తరగీతకీర్తిం
ఆచారశుద్ధో భయవంశదీపం । శుద్ధాంతరక్ష్యా జగదేకుమారీ॥ ౪౫

నీపాన్వయః పార్థివ ఏషయజ్వా । గుణైర్యమాశ్రిత్య పరస్పరేణ
సిద్ధాశ్రమం శాంత మివైత్యసత్త్వై । ర్నైసర్గికో ప్యుత్ససృజే విరోధః॥ ౪౬

యస్యాత్మగేహే నయనాభిరామా । కాంతి ర్హిమాంశో రివసన్నివిష్టా
హర్మ్యాగ్ర సంరూఢ తృణాంకురేషు । తేజోవిషహ్యాం రిపుమందిరేషు॥ ౪౭

యస్యావరోధ స్తనచందనానాం । ప్రక్షాళనా ద్వారివిహారకాలే
కలిందకన్యా మధురాంగతాపి । గంగోర్మిసంసక్త జలేవభాతి॥ ౪౮

బంధుపద్మమ్ములలరించి ♦ వైరిపంక । మింకఁజేసిప్రతాపాన ♦ నెసఁగునతని
యందు మృదుల కుముద్వతి ♦ యాత్మభావ । బంధమునుభానుమతివలెఁ♦బలుపదర్చు॥ ౭౬

అంతఁగంజాతగర్భంపుఁ ♦ గాంతికలిగి । వనజగర్భునిసృష్టికి ♦ వన్నెయిడెడు
రూపనుగుణాఢ్యసుదతి న ♦ నూపనృపతి । యెదుటఁజేర్చిసునంద దా♦నిట్లుపలికె॥ ౭౭

యూపములఁబదునెన్మిది ♦ ద్వీపములను । నిల్పివేయిభుజమ్ములఁ ♦ గొల్పియాజిఁ
బరులుగనఁగాని రాజశ♦బ్దంబుఁబడసి । యుండెఁగాకార్తవీర్యుఁడ♦నోగియొకఁడు॥

సలుపఁదగనివి సలుపంగఁ ♦ దలఁచునంత । నెక్కుడినచాపము హుఁ బాల్చి ♦ యెదుటనిల్చి
చెడుతలంపులుమనములఁ ♦ జెందకుండఁ । బ్రజలశిక్షించిరక్షించు ♦ వాఁడతండు॥ ౭౮

అల్లెత్రాటనుభుజము ల ♦ ల్లాడకుండఁ । గట్టనిట్టూర్పువెట్టి వ ♦ క్త్రములయందు
నతనిచెఱనుండెఁగరుణించి ♦ యనుపుదాఁక । నిందుర్గెల్చినయట్టి లం♦కేశ్వరుండు॥ ౮౦

అతనికులమున నీప్రతీ♦పాఖ్యనృపతి । జ్ఞానవృద్ధులఁగొల్చు ను♦జ్ఞానిగలిగి
సిరికినాశ్రితదోషాళి ♦ చేతఁబొడమ । ప్రకృతి చంచలయనునిందఁ ♦ బాపివైచె॥ ౮౧

వహ్నిసాయంబుయుద్ధానఁ ♦ బడసియితఁడు । క్షత్రియులకాలరాత్రియై ♦ చన్నయట్టి
పరశురామునివాఁడియౌ ♦ పరశుధారఁ । గలువరేకులసారంబు ♦ గాఁగనెంచె॥ ౮౨

మించిమాహిష్మతీపుర ♦ కాంచియైన । విమలరేవానదీపూర ♦ విభవములను
హర్మ్యములనుండిచూడఁగా ♦ నాసయున్న । నగుము నీవీమహాభుజు ♦ నంకలక్ష్మి॥ ౮౩

ఎంతప్రియదర్శనుండైన ♦ నిందుమతికి । నన్నృపాలుఁడురుచియింపఁ ♦ డయ్యెఁ గోర
మొగిలువీడి శరత్కాల♦పూర్ణుఁడయ్యు । నిందుఁ డబ్జంబులకు రుచి ♦ యింపనట్లు॥ ౮౪

అంత నక్కన్యకిట్లనె ♦ నాసునంద । యుభయకులదీపమును మఱి ♦ శుభచరిత్రుఁ
డగుచు లోకాంతరములను ♦ యశము గాంచి । చెలఁగునాశూరసేను ను♦పేణుఁజూపి॥

ఇతఁడునీపాన్వయుఁడుయాజి ♦ యితనిఁబొంది । గుణములన్యోన్యవైరంబు ♦ గొనకపోదలు
శాంతసిద్ధాశ్రమముఁబొంది ♦ సత్త్వచయము । ప్రకృతివైరమ్ములనుమాని ♦ పరఁగురీతి॥

కనులకభిరామమాచంద్ర ♦ కాంతివంటి । కాంతితనమందిరమ్మునఁ ♦ గ్రాలఁజేసె
భూరిహర్మ్యాగ్రములగడ్డి ♦ మొలచియున్న । శత్రుగృహములదుస్సహ ♦ శౌర్యముంచె॥

ఇతఁడు జలకేళిశుద్ధాంత ♦ సతులఁగూడి । సలుపఁదత్కుచచందన ♦ ములనుగలసి
యమునమధురాపురప్రాంత ♦ మందునున్న । గంగతరఁగలఁగూడిన ♦ కరణినొప్పు॥ ౮౮

త్రస్తేన తార్క్ష్యాత్కిల కాలియేన । మణింవిసృష్టం యమునౌకసాయః
వక్షఃస్థల వ్యాపి రుచందధానః । సకౌస్తుభం హ్రేపయతీవకృష్ణం॥ ౪౯

సంభావ్య భర్తారమముం యువానం । మృదుప్రవాళోత్తర పుష్పశయ్యే
బృందావనే చైత్రరథా దనూనే । నిర్విశ్యతాం సుందరి యౌవనశ్రీః॥ ౫౦

అధ్యాస్య చాంభః పృషతోక్షితాని । శైలేయగంధీని శిలాతలాని
కలాపినాంప్రావృషి పశ్యనృత్యం । కాంతాసు గోవర్ధన కందరాసు॥ ౫౧

నృపంతమావర్త । మనోజ్ఞనాభిః । సావ్యత్యగా దన్యవధూ ర్భవిత్రీ
మహీధరం మార్గవశాదుపేతం । స్రోతోవహా సాగరగామినీవ॥ ౫౨

అథాంగదాశ్లిష్టభుజం భుజిష్యా । హేమాంగదం నామకళింగ నాథమ్
ఆసేదుషీం సాదితశత్రుపక్షం । బాలామబాలేందుముఖీం బభాషే॥ ౫౩

అసౌమహేంద్రాద్రి సమానసారః । పతిర్మహేంద్రస్య మహోదధేశ్చ
యస్యక్షర త్సైన్య గజచ్ఛలేన । యాత్రానుయాతీవ పురోమహేంద్రః॥ ౫౪

జ్యాఘాత రేఖే సుభుజో భుజాభ్యాం । బిభర్తి యశ్చాపభృతాం పురోగః
రిపుశ్రియాం సాంజన బాష్పసేకే । బందీకృతానా మివ పద్ధతీ ద్వే॥ ౫౫

యమాత్మనః సద్మని సన్నికృష్టో । మంద్రధ్వని త్యాజిత యామతూర్యః
ప్రాసాదవాతాయన దృశ్యవీచిః । ప్రబోధయ త్యర్ణవ ఏవసుప్తం॥ ౫౬

అనేనసార్ధం విహరాంబురాశే । స్తీరేషు తాలీవనమర్మరేషు
ద్వీపాంతరానీత లవంగపుష్పై । రపాకృత స్వేదలవామరుద్భిః॥ ౫౭

ప్రలోభితా ప్యాకృతి లోభనీయా । విదర్భరాజావర జాతయైవం
తస్మాదపావర్తత దూరకృష్టా । నిత్యేవలక్ష్మీః ప్రతికూలదైవాత్॥ ౫౮

అథోరగాఖ్యస్య పురస్యనాథం । దౌవారికీ దేవసరూప మేత్య
ఇతశ్చకోరాక్షి విలోకయేతి । పూర్వానుశిష్టాం నిజగాదభోజ్యాం॥ ౫౯

పాండ్యోయమంసార్పిత లంబహారః । క్లృప్తాంగరాగో హరిచందనేన
ఆభాతిబాలాతప రక్తసానుః । సనిర్ఝరోద్గార ఇవాద్రిరాజః॥ ౬౦

వింధ్యస్య సంస్తంభయితామహాద్రే । ర్నిశ్శేషపీతోజ్ఝిత సింధురాజః
ప్రీత్యాశ్వమేధావభృథార్ద్రమూర్తేః । సౌస్నాతికో యస్య భవత్యగస్త్యః॥ ౬౧

గరుడునకునోడి యమునలోఁ ♦ గాఁపురంబు। సలుపు కాళీయుఁ డిచ్చిన ♦ వెలుఁగుమణిని
వక్షమునఁదాల్చుఁగౌస్తుభ ♦ వజ్రమూను । కృష్ణునకులజ్జగొల్పెడు ♦ క్రియనితండు॥ ౪౯

ఈపడుచు చేని భర్తగా ♦ నెంచినీవు । చిగురు లునిచిన మెత్తపూ ♦ సెజ్జమీఁద
యౌవనశ్రీలసుందరీ ♦ యనుభవింపు । చైత్రరథతుల్యబృందావి ♦ చిత్రవనిని॥ ౫౦

రాతిపూపరిమళముల ♦ రమ్యమగుచుఁ । జినుకులనుగాంచి తడిసిన ♦ శిలలనుండి
కనుము గోవర్ధనాచింత ♦ కందరములఁ । గలుగుశిఖినృత్యముల వాన ♦ కాలునందు॥ ౫౧

అన్య పత్నిగఁదెలిసి త♦న్నక్కుమారి । నుడిపగిదినాభిచెన్నారు ♦ సుందరాంగి
యబ్ధిఁజనుచున్ననడ్డమై ♦ యదిగ్రిరాఁగఁ । దప్పనదివలెఁ దన్నుఁబ్రియుఁ ♦ దప్పిచనియె॥ ౫౨

అంత రిపుపక్షభంగు హే♦మాంగదాఖ్యు । నంగదాంచితబాహు క♦ళింగనాథు
నెదుటిబాలకుఁబూర్ణేందు ♦ వదనకనియె । నమలదౌవారికామణి ♦ యౌ సునంద॥ ౫౩

ఇతఁడు బలమునఁబోలు మ♦హేంద్రగిరిని । నేలుచుండుమహాబ్ధి మ♦హేంద్రములను
ఇతనియాత్రలముందు మ♦హేంద్రశైల । మరుగుమదగజతతిమిష ♦ ననఁగఁదోఁచు॥ ౫౪

కార్ముకధరాగ్రగణ్యుఁడై ♦ కాల్చునితఁడు । గలనఁగొనిచనురిపులక్ష్మి ♦ కజ్జలాశ్రు
ధారఁదడిసినరెండు ప♦థమ్ములనఁగ । భుజములఁగిణాంక రేఖలు ♦ పూనినాఁడు॥ ౫౫

అబ్ధియీతనినిలయంబు ♦ నంటియుంట । నతులరవముల యామతూ♦ర్యములమించి
సౌధజాలాళివీచి ద♦ర్శనమొసంగి । మేలుకొలుపును సుప్తు నృ♦పాలునితని॥ ౫౬

పడసిద్వీపాంతరలవంగ ♦ పరిమళమును । జెమటలార్చెడువాతపో ♦ తములఁజెలఁగి
తాళవనములమర్మర ♦ ధ్వనులమించు । జలధితటములనితనితో ♦ సలుపు కేళి॥ ౫౭

అనుచు లోభమ్మునెంతఁ గొ♦ల్పినను వినక । రూపవతిభోజుచెల్లె లా ♦ భూపుఁదొలఁగఁ
దన్నుదూరాననుండి య♦త్నమునదేఁగ । సిరితలంపక దురదృష్టుఁ ♦ దొలఁగుకరణి॥ ౫౮

అంతభోజాన్వయనుగూడి ♦ యమరరూపు । నాగపురనృపుఁజేరి సు♦నందపలికె
నిందుమతితోడనెప్పటి ♦ చందమునను । గాంచుమిటను జకోరాక్షి ♦ యంచుఁజూపి॥

పాండ్యుఁడీతఁడుచందన ♦ పంకమలఁది । మూఁపునను హారములువ్రేలఁ ♦ బొదలుచుండు
నెఱ్ఱనైసానువొప్ప లే ♦ యెండచేత । నేళ్లుదిగఁబాఱఁగాఁ్రలు న♦గేంద్రుపగిది॥ ౬౦

అశ్వమేధావభృథముచే ♦ నంగమెల్ల । దడియునితనికి సౌస్నాత♦కుఁడును బ్రియుఁడు
వింధ్యము నణంచి సంద్రమ్ము♦ పీల్చిదానిఁ । గ్రిమ్మఱఁద్యజిఁచినట్టి య♦గస్త్యమౌని॥ ౬౧

అస్త్రంహరాదాప్తవతా దురాపం । యేనేంద్రలోకావ జయాయ దృప్తః
పురాజనస్థాన విమర్దశంకీ । సంధాయ లంకాధిపతిః ప్రతస్థే॥ ౬౨

అనేనపాణౌ విధివద్గృహీతే । మహాకులీనేన మహీవగుర్వీ
రత్నానువిద్ధార్ణవ మేఖలాయా । దిశః సపత్నీ భవదక్షిణస్యాః॥ ౬౩

తాంబూలవల్లీ పరిణద్ధపూగా । స్వేలాలతాలింగిత చందనాసు
తమాలపత్త్రా స్తరణాసురంతుం । ప్రసీదశశ్వ న్మలయస్థలీషు॥ ౬౪

ఇందీవరశ్యామ తనుర్నృపోసౌ । త్వంరోచనాగౌర శరీరయష్టిః
అన్యోన్యశోభా పరివృద్ధయేవాం । యోగస్తటిత్తోయదయో రివాస్తు॥ ౬౫

స్వసుర్విదర్భాధిపతే స్తదీయో । లేభేంతరం చేతసి నోపదేశః
దివాకరాదర్శన బద్ధకోశే । నక్షత్రనాథాంశు రివారవిందే॥ ౬౬

సంచారిణీ దీపశిఖేవ రాత్రౌ । యంయంవ్యతీయాయ పతింవరాసా
నరేంద్రమార్గాట్ట ఇవప్రపేదే । వివర్ణభావం ససభూమిపాలః॥ ౬౭

తస్యాంరఘోః సూనురుపస్థితాయాం । వృణీతమాంనేతి సమాకులోభూత్
వామేతరః సంశయమస్య బాహుః । కేయూరబంధో చ్ఛ్వసితైర్నునోద॥ ౬౮

తంప్రాప్య సర్వావయవా నవద్యం । వ్యావర్తతాన్యోప గమాత్కుమారీ
నహిప్రఫుల్లం సహకారమేత్య । వృక్షాంతరం కాంక్షతి షట్పదాళిః॥ ౬౯

తస్మిన్సమావేశిత చిత్తవృత్తి । మిందుప్రభామిందుమతీ మవేక్ష్య
ప్రచక్రమేవక్తు మనుక్రమజ్ఞా । సవిస్తరంవాక్య మిదం సునందా॥ ౭౦

ఇక్ష్వాకువంశ్యః కకుదంనృపాణాం । కకుత్స్థ ఇత్యాహితలక్షణోభూత్
కాకుత్స్థ శబ్దంయతఉన్నతేచ్ఛాః । శ్లాఘ్యం దధత్యుత్తర కోసలేంద్రాః॥ ౭౧

మహేంద్రమాస్థాయ మహోక్షరూపం । యఃసంయతి ప్రాప్త పినాకిలీలః
చకారబాణై రసురాంగనానాం । గండస్థలీః ప్రోషితపత్త్రలేఖాః॥ ౭౨

ఐరావతాస్ఫాలన విశ్లథంయః । సంఘట్టయన్నం గదమంగదేన
ఉపేయుషః స్వామపిమూర్తిమగ్ర్యా । మర్ధాసనం గోత్రభిదోధితస్థౌ॥ ౭౩

జాతఃకులేతస్య కిలోరుకీర్తిః । కులప్రదీపో నృపతిర్దిలీపః
అతిష్ఠదేకోన శతక్రతుత్వే । శక్రాభ్యసూయా వినివృత్తయేయః॥ ౭౪

హరునిచేనస్త్రమందిన దు♦రాపుఁడైన । యీతఁడోర్చ్చ జనస్థాన♦మేచియంచుఁ
దొలుత సంధినినీతని ♦ తోడసలిపి । యింద్రుపై నేగెఁ జేర్చి లం♦కేశ్వరుండు॥ ౬౨

విధివిహితమైనయట్టి స♦ద్విధులతోడ । నిమ్మహాకపులుకరము గ్రి♦హించినీవు
మణిమయుతార్ణవమేఖలా ♦ మండితయగు । వసుధపలె దక్షిణాశాస ♦ పత్నివగుము॥ ౬౩

ఏలకులుబాగ్రిసుచందన ♦ వృక్షములను । నాగవల్లులుపెనగొన్న ♦ పూగములను
బైఁబయినిరాలిన తమాల ♦ పత్రములను । జెలఁగుమలయస్థలులకేళి ♦ సలుపుమీవు॥ ౬౪

ఎసఁగునీలోత్పలశ్యామ ♦ మితనిమేను । నెగడుగోరోజనపుఁజాయ ♦ నీదుతనువు
మీసమాగమ మాతటి ♦ మేఘములను । మించి యన్యోన్యశోభను ♦ బెంచుఁగాత॥ ౬౫

అనెడుచెలిబోధయవకాశ ♦ మందదయ్యె । నావిదర్భేశుచెలియలి ♦ యాత్మయందు
నర్కుఁగానమిమోడ్చిన ♦ యబ్జమందు । నిందుకిరణాళి యవకాశ ♦ మందనట్లు॥ ౬౬

ఆపతింవరయొక్కొక్క ♦ భూపుదాఁటి । పోనవైవర్ణ్యమాతనిఁ ♦ బొందుచుండె
రాత్రిదివ్వటిఁగొనిచన ♦ రాజవీధిఁ । గడచినగృహంబుచీఁకటిఁ ♦ బడయుపగిది॥ ౬౭

అంతరఘునూతితనుడాయు ♦ నామెఁజూచి । వలచునోలేదొయనిమదిఁ ♦ గలఁగఁజొచ్చె
సడలభుజకీర్తియాతని ♦ కుడిభుజమ్ము । వడిగఁగంపించి సంశయ ♦ మెడలఁజేసె॥ ౬౮

అతనిసర్వాంగసుందరు ♦ నక్కుమారి । చేరియన్యులడాయంగఁ ♦ గోరదయ్యెఁ
బుష్పితరసాలభూజంబు ♦ పొంతఁజేరి । యన్యవృక్షంబుఁగోరునే ♦ యళికులంబు॥ ౬౯

మానసపుప్రవృత్తినాతని ♦ లోనఁజేర్చి । యిందుకాంతినిజెన్నారు ♦ నిందుమతిని
గాంచి పల్కులక్రమముఁ జ♦క్కఁగనెఱుంగు । నానునంద సవిస్తృతి♦ననియెనిట్లు॥ ౭౦

తిలకమై యొండ్లకిక్ష్వాకు ♦ కులమునందు । ఖ్యాతగుణుఁడు కకుత్స్థుఁడు ♦ గలిగెఁగాన
నుత్తరపుఁగోసలేశ్వరు ♦ లున్నతేచ్ఛ । లందికాకుత్స్థపూజ్యాంక ♦ మలరుచుంద్రి॥ ౭౧

వృషభరూపంబుదాల్చిన ♦ యింద్రునెక్కి । యాలమునపాపిసాకిని ♦ లీలఁబొలిచి
రాక్షసస్త్రీలచెక్కిళ్ళ ♦ వ్రాసియున్న । చిత్రములబాణములచేతఁ♦జెటిపెనతఁడు॥ ౭౨

అగ్గిరివిభేదితనపూజ్య ♦ మైనరూప । మందినపుడును నతని పీ♦ఠార్ధమందు
నమరకరిఁదట్టసడలిన ♦ యంగదమ్ము । నంగదము రాయఁగూర్చుండి ♦ యలరఁగలిగె॥ ౭౩

అతనికులమునఁగులదీపుఁ ♦ డౌదలీప । నృపతియురుకీర్తి జన్మించి ♦ యొలమినించి
శకుని యసూయమాన్పఁగా ♦ సలిపెనొకటి । దక్కవగ నూఱుజన్నముల్ ♦ధరణిమీఁద॥

యస్మిన్మహీం శాసతివాణినీనాం । నిద్రాంవిహారార్ధపథే గతానాం
వాతోపినాస్రం సయదంశుకాని । కోలంబయేదాహరణాయ హస్తం॥ ౭౫

పుత్రోరఘుస్తస్య పదంప్రశాస్తి । మహాక్రతోర్విశ్వ జితఃప్రయోక్తా
చతుర్దిశావర్జిత సంభృతాంయో । మృత్పాత్రశేషా మకరోద్విభూతిం॥ ౭౬

ఆరూఢమద్రీ నుదధీన్వితీర్ణం । భుజంగమానాంవ సతింప్రవిష్టం
ఊర్ధ్వంగతంయస్య నచానుబంధి । యశః పరిచ్ఛేత్తుమియత్తయాలం॥ ౭౭

అసౌకుమారస్త మజోనుజాత । స్త్రివిష్టపస్యేవ పతింజయంతః
గుర్వీం ధురం యోభువనస్యపిత్రా । ధుర్యేణదమ్యః సదృశీం బిభర్తి॥ ౭౮

కులేనకాంత్యా వయసానవేన । గుణైశ్చతై స్తైర్వినయ ప్రధానైః
త్వమాత్మనస్తుల్య మముంవృణీష్వ । రత్నంసమాగచ్ఛతు కాంచనేన॥ ౭౯

తతఃసునందా వచనావసానే । లజ్జాంతనూకృత్య నరేంద్రకన్యా
దృష్ట్యాప్రసాదామలయా కుమారం । ప్రత్యగ్రహీ త్సంవరణస్రజేన॥ ౮౦

సాయూని తస్మిన్నభిలాప బంధం । శశాకశాలీనతయా నవక్తుం
రోమాంచలక్ష్యే ణచ గాత్రయష్టిః । భిత్వానిరాక్రామ దరాలకేశ్యాః॥ ౮౧

తథాగతాయాం పరిహాసపూర్వం । సఖ్యాంసఖీ వేత్రభృదా బభాషే
ఆర్యేవ్రజామోన్యత ఇత్యథైనాం । వధూరసూయాకుటిలం దదర్శ॥ ౮౨

సాచూర్ణ గౌరం రఘునందనస్య । ధాత్రీకరాభ్యాం కరభోపమోరూః
ఆసంజయామాస యథాప్రదేశం । కంఠేగుణంమూర్త మివానురాగం॥ ౮౩

తయా స్రజామంగళపుష్పమయ్యా । విశాలవక్షఃస్థల లంబయాసః
అమంస్త కంఠార్పితబాహుపాశాం । విదర్భరాజావరజాం వరేణ్యః॥ ౮౪

శశినముపగతేయం కౌముదీ మేఘముక్తం
జలనిధిమనురూపం జహ్నుకన్యావతీర్ణా
ఇతిసమగుణయోగ ప్రీతయస్తత్రపౌరాః
శ్రవణకటునృపాణా మేకవాక్యంవివవ్రుః॥ ౮౫

ప్రముదితవరపక్ష మేకతస్తత్
క్షితిపతిమండల మన్యతోవితానం

అతఁడుధర నేలమండ వి♦హారభూమి । కరుగుదారిని నిద్రించు ♦ నట్టిమస్తు
రాలివల్వలుముట్టఁడు ♦ గాలికూడఁ । బరుఁడెవఁడు చూచుమహత్త్వంబు ♦ వానిగొనఁగ॥

విశ్వజిద్యాగ మొనరించి ♦ వెలయుచుండు । నతనిపుత్త్రుండు రఘువేల్పు ♦ నతనిసదము
నలుదెసలనోర్చికొన్నట్టి ♦ కలిమినెల్ల । నొక్కముష్టిపాత్రగామార్చి ♦ యొప్పినాఁడు॥

అచలములనెక్కిదాఁటె మ♦హార్ణవముల । నురగులనివాసమునుజొచ్చె ♦ నూర్ధ్వమునగ
నడ్డులేకయె విహరించె ♦ నతనియశము । దానిఁగొల్వంగ శక్యమే ♦ దేనికైన॥ ౭౭

స్వర్గపతికిజయంతుని ♦ చందమందు । నతనికిఁగుమారుఁడితఁడజుఁ ♦ డవతరించి
తండ్రితోఁదుల్యముగఁదాల్చె ♦ ధరణిభరము । మత్తనృషభముసరిమోచు ♦ గిత్తవోలె॥

వినయముప్రధానమైయొప్పు ♦ విమలకాంతి । కులగుణప్రియములనీకుఁ ♦ గులయుతుండు
గోరివరియింపుమీతనిఁ ♦ గూర్మిమీఱఁ । గనకమునుగూడి రత్నమ్ము ♦ కాంతిలుఁగాదె॥ ౭౮

అనుమసఖిపల్కఁగావిని ♦ యంతమందు । నించుకతొలఁగిలజ్జ న♦ [illegible]
ప్రవిమలామోదదృష్టితో ♦ రాకొమారు । స్రజముతోవలె నరియించి♦ [illegible]

రఘునుతునిమీఁదితన యను ♦ రాగమపుడు । [illegible] ♦ [illegible]
గాననావక్రికుంతల ♦ గాత్రయష్టి । వ్రిచ్చుకొనినచ్చఁబులకలఁ ♦ [illegible]

ఇప్పగిదినుండు నెచ్చెలి ♦ కిందుమతికిఁ । బలికెనవ్వేళకైవేత్ర ♦ [illegible]
పోదమాయన్యుఁగూరిచి ♦ పూజ్యురాల । యనినవోక్క యబ్బాల♦ [illegible]॥ ౭౯

అంతఁ గరభోరువక్కన్య ♦ యానరేంద్ర । నందనునికంఠమందు సు♦[illegible]
న్వర్త దేశానఁబెట్టించె♦ నమలమూర్తి । గౌరమును రాగమూర్తినాఁ♦ [illegible]॥

మంగళముఁదెల్పు పుష్పదా ♦ మమ్మజుండు । విపులవక్షస్స్థలంబున ♦ వ్రేలఁగాంచి
యన్విదర్భసుతనుజాత ♦ యాత్మకంఠ । మందిడినబాహు పాశమ్మ♦[illegible]॥ ౮౦

మత్తకోకిల. సుగుణతుల్యులయోగమచ్చటఁ ♦ జూచిపౌరులు ప్రీతులై
మొగిలువీడిన చంద్రుఁగూడిన ♦ పూర్ణచంద్రిక యొంతయుఁ
దగినవార్నిధిఁజొచ్చిపాల్చెదు ♦ ధన్యజాహ్నవి యీమెగా
జగతిలోననిపల్కిరొక్కట ♦ శ్మ్యేవరుల్ వినఁజేదుగాఁ॥ ౮౧

మత్తకోకిల. వరునిపక్షమువారుదామొక ♦ వంకసంతసమందఁగాఁ
బరనృపాలగణంబువేఱొక ♦ వంక దైన్యముఁజెందఁగా

ఉషసి సర ఇవ ప్రఫుల్లపద్మం
కుముదవనప్రతిపన్ననిద్రమాసీత్ ॥ ౮౬

ఇతి శ్రీరఘువంశే మహాకావ్యే కాళిదాసకృతౌ
స్వయంవరవర్ణనో నామ షష్ఠః సర్గః.



సరసిజంబులువిచ్చఁ గల్వలు ♦ సర్వముఁ ముకుళింపఁగా
సర ముపస్సమయానఁగాంచెడు ♦ చండమాసభరయుండఁగా॥ ౧౬

గద్య.

ఇది శ్రీ పరమేశ్వర కరుణాకలిత లలితకవితాకలిత శ్రీరామలక్ష్మాంబా బుచ్చి
వేంకయామాత్య తనూజాత సకలసజ్జనవిధేయ ఆదిపూడి సోమనాథ
నామధేయ ప్రణీతంబయిన యాంధ్రరఘువంశంబునందు స్వ
యంవరవర్ణనమనెడు షష్ఠాశ్వాసము
సంపూర్ణము.





శ్రీ

# రఘువంశమ్

## సప్తమః సర్గః

—:o:—

అథోపయన్త్రా సదృశేన యుక్తాం । స్కన్దేన సాక్షాదివ దేవసేనాం
స్వసారమాదాయ విదర్భనాథః । పురప్రవేశాభిముఖో బభూవ॥ ౧

సేనానివేశాన్పృథివీక్షితోఽపి । జగ్ముర్విభాతగ్రహమన్దభాసః
భోజ్యాం ప్రతి వ్యర్థమనోరథత్వా । ద్రూపేషు వేషేషు చ సాభ్యసూయాః॥ ౨

సాన్నిధ్యయోగాత్కిల తత్ర శచ్యాః । స్వయంవరక్షోభకృతామభావః
కాకుత్స్థముద్దిశ్య సమత్సరోఽపి । శశామ తేన క్షితిపాలలోకః॥ ౩

తావత్ప్రకీర్ణాభినవోపచార । మిన్ద్రాయుధద్యోతితతోరణాఙ్కం
వరః స వధ్వా సహ రాజమార్గం । ప్రాప ధ్వజచ్ఛాయనివారితోష్ణం॥ ౪

తతస్తదాలోకనతత్పరాణాం । సౌధేషు చామీకరజాలవత్సు
బభూవురిత్థం పురసున్దరీణాం । త్యక్తాన్యకార్యాణి విచేష్టితాని॥ ౫

ఆలోకమార్గం సహసా వ్రజన్త్యా । కయాచిదుద్వేష్టనవాన్తమాల్యః
బద్ధుం న సమ్భావిత ఏవ తావత్ । కరేణ రుద్ధోఽపి చ కేశపాశః॥ ౬

ప్రసాధికాలమ్బితమగ్రపాద । మాక్షిప్య కాచిద్ద్రవరాగమేవ
ఉత్సృష్టలీలాగతిరాగవాక్షా । దలక్తకాఙ్కాం పదవీం తతాన॥ ౭

విలోచనం దక్షిణమఞ్జనేన । సమ్భావ్య తద్వఞ్చితవామనేత్రా
తథైవ వాతాయనసన్నికర్షం । యయౌ శలాకామపరా వహన్తీ॥ ౮

జాలాన్తరప్రేషితదృష్టిరన్యా । ప్రస్థానభిన్నాం న బబన్ధ నీవీం
నాభిప్రవిష్టాభరణప్రభేణ । హస్తేన తస్థావవలమ్బ్య వాసః॥ ౯



శ్రీ

# రఘువంశము.

## సప్తమాశ్వాసము.

---:o:---

### గీతములు.

దేవసేనానితోనున్న ♦ దేవసేన । పగిదిఁ నిస్వతుల్యుఁడైనట్టి ♦ పతినిగూడి
పొలుచుచెల్లెలిఁ దోకొని ♦ పురముగూర్చి । వెడలెను విదర్భనాథుండు ♦ వేడ్కమీఱ॥ ౧

భోజకులజాతయాశలఁ ♦ బోనడంప । రూపవేషములనుగూర్చి ♦ గోతపడుచు
వేఁడువనుజుక్కలట్టులు ♦ వెల్లఁబోయి । శిబిరములఁజేరెనప్పు డా ♦ క్షితిపచయము॥ ౨

అప్పు డట శచిసన్నిధి ♦ యమరియుంట । నాస్వయంవరమును విష్ణు ♦ మంటపమ్ము
నక్కకుస్థకులోత్తమ్ము ♦ నందునృపుల । కెంతపగయున్ననా మెచే ♦ శాంతమయ్యె॥ ౩

క్రొన్ననలచేతనేలకట్టు ♦ కొమరునింపఁ । దోరణము లింద్రచాపమ్ము ♦ సొరుఁజెంపఁ
డెక్కెములనీడవేఁడిమి ♦ యుక్కడంప । దంపతులు రాజమార్గానఁ ♦ దరలిరపుడు॥ ౪

అంతసౌధాళిఁ బైడి గ♦వాక్షములను । వారిఁగాంచెడువేడ్కతోఁ ♦ బౌరనారు
లిట్లు తమతమ పనిపాటు ♦ లెల్లవీడి । మూఁకలుగవచ్చిమూఁగిరి ♦ మోదమిడుచు॥ ౫

వీడిముడి దారిపొడుగున ♦ విరులురాల । వడిగనొక్క తెజాలమ్ము ♦ వంకఁబాఱెఁ
జేతఁగురులున్నచొప్పటుఁ ♦ జేరుదాఁక । వేయఁదలఁపదుముడిని న♦వ్వేలఁదిమిన్న॥ ౬

ఓర్తు లత్తుకకైచాచి ♦ యున్నకాలు । దీసి వడిగను జాలమ్ము ♦ కేసిపఱచె
లలితగతిమాని యారని ♦ లక్కరసపు । టడుగుజాడలనించుచు ♦ నంతసఖిక॥ ౭

కాటుకను బెట్టితనకుడి ♦ కంటికంత । నెడమకంటికినిడకయే ♦ యింతియొకతె
పుడకచేతనుబట్టి తాఁ ♦ బోయిచేరెఁ । దద్దయును వేడ్కతోడ వా♦తాయనమ్ము॥ ౮

జాలమునదృష్టిపఱచుచుఁ ♦ జానయొర్తు । పోవుచుండఁగ వీడిన ♦ పోకముడిని
గట్టకయె జారుచీరెను ♦ బట్టిచేత । భూషణప్రభనాభిపైఁ ♦ బొడలనిలిచె॥ ౯

అర్ధాచితా సత్వరముత్థితాయాః । పదేపదే దుర్నిమితే గలంతీ
కస్యాశ్చిదాసీద్రసనా తదానీం । అంగుష్ఠమూలార్పిత సూత్రశేషా॥ ౧౦

తాసాంముఖై రాసవగంధగర్భైః । ర్వ్యాప్తాంతరాః సాంద్రకుతూహలానామ్
విలోలనేత్రభ్రమరై ర్గవాక్షాః । సహస్రపత్రాభరణా ఇవాసన్॥ ౧౧

తా రాఘవం దృష్టిభిరాపిబంత్యో । నార్యోనజగ్ము ర్విషయాంతరాణి
తథాహి శేషేంద్రియ వృత్తిరాసాం । సర్వాత్మనా చక్షురివప్రవిష్టా॥ ౧౨

స్థానే వృతా భూపతిభిః పరోక్షైః । స్వయంవరం సాధుమమంస్త భోజ్యా
పద్మేవనారాయణ మన్యథాసౌ । లభేతకాంతం కథమాత్మతుల్యం॥ ౧౩

పరస్పరేణస్పృహణీయ శోభం । నచేదిదం ద్వంద్వ మయోజయిష్యత్
అస్మిన్ద్వయే రూపవిధాన యత్నః । పత్యుః ప్రజానాం వితథోభవిష్యత్॥ ౧౪

రతిస్మరౌ నూనమిమావభూతాం । రాజ్ఞాంసహస్రేషు తథాహిబాలా
గతేయమాత్మ ప్రతిరూపమేవ । మనోహి జన్మాంతర సంగతిజ్ఞం॥ ౧౫

ఇత్యుద్గతాః పౌరవధూముఖేభ్యః । శృణ్వన్కథాః శ్రోత్రసుఖాః కుమారః
ఉద్భాసితం మంగళసంవిధాభిః । సంబంధినః సద్మసమాససాద॥ ౧౬

తతోవతీర్యాశుకరేణు కాయాః । సకామరూపేశ్వర దత్తహస్తః
వైదర్భనిర్దిష్ట మథోవివేశ । నారీమనాంసీవ చతుష్కమంతః॥ ౧౭

మహార్హసింహాసన సంస్థితోసౌ । సరత్నమర్ఘ్యం మధుపర్కమిశ్రం
భోజోపనీతంచ దుకూలయుగ్మం । జగ్రాహసార్ధం వనితాకటాక్షైః॥ ౧౮

దుకూలవాసాః సవధూసమీపం । నిన్యేవినీతై రవరోధరక్షైః
వేలాసకాశంస్ఫుట ఫేనరాజి । ర్నవైరుదన్వా నివచంద్రపాదైః॥ ౧౯

తత్రార్చితో భోజపతేః పురోధా । హుత్వాగ్నిమాజ్యాదిభి రగ్నికల్పః
తమేవచాధాయ వివాహసాక్ష్యే । వధూవరౌ సంగమయాంచకార॥ ౨౦

హస్తేనహస్తం పరిగృహ్య వధ్వాః । సరాజసూనుః సుతరాం చకాశే
అనంతరాశోకలతా ప్రవాళం । ప్రాప్యేవచూతః ప్రతిపల్లవేన॥ ౨౧

ఆసీద్వరః కంటకితప్రకోష్ఠః । స్విన్నాంగుళిః సంవవృతేకుమారీ
వృత్తిస్తయోః పాణిసమాగమేన । సమంవిభక్తేవ మనోభవస్య॥ ౨౨

కుసుమమేవనకేవలమార్తవం । నవమశోకతరోః స్మరదీపనం
కిసలయప్రసవోఽపివిలాసినాం మదయితాదయితాశ్రవణార్పితః॥ ౩౬

విరచితామధునోపవనశ్రియా । మభినవాఇవపత్త్రవిశేషకాః
మధులిహాంమధుదానవిశారదాః । కురవకారవకారణతాంయయుః॥ ౩౭

సువదనావదనాసవసంభృత । స్తదనువాదిగుణఃకుసుమోద్గమః
మధుకరైరకరోన్మధులోలుపై । ర్బకుళమాకులమాయతపంక్తిభిః॥ ౩౮

గమయితుంప్రభురేషసుఖేనమాం । నమహతీంబతపాంథవధూజనః
ఇతిదయాతఇవాభవదాయతా । నరజనీరజనీశవతీమధౌ॥ ౩౯

ప్రథమమన్యభృతాభిరుదీరితాః । ప్రవిరళాఇవముగ్ధవధూకథాః
సురభిగంధిషుశుశ్రువిరేగిరః । కుసుమితాసుమితావనరాజిషు॥ ౪౦

శ్రుతిసుఖభ్రమరస్వనగీతయః । కుసుమకోమలదంతరుచోబభుః
ఉపవనాంతలతాః పవనాహతైః । కిసలయైఃసలయైరివపాణిభిః॥ ౪౧

లలితవిభ్రమబంధవిచక్షణం । సురభిగంధపరాజితకేసరం
పతిషునిర్వివిశుర్మధుమంగనాః । స్మరసఖంరసఖండనవర్జితం॥ ౪౨

తిలకమస్తకహర్మ్యకృతాస్పదైః । కుసుమమధ్వనుషంగసుగంధిభిః
కలమగీయతభృంగవిలాసినాం । స్మరయుతైరయుతైరబలాసఖైః॥ ౪౩

శుశుభిరేస్మితచారుతరాననాః । స్త్రియఇవశ్లథశింజితమేఖలాః
వికచతామరసాగృహదీర్ఘికా । మదకలోదకలోలవిహంగమాః॥ ౪౪

లఘయతిస్మనపత్యపరాధజం । నసహకారతరుస్తరుణీధృతం
కుసుమితోనమితోలిభిరున్మదైః । స్మరసమాధిసమాధికరోషితం॥ ౪౫

ఉపయయౌతనుతాంమధుఖండితా । హిమకరోదయపాండుముఖచ్ఛవిః
సదృశమిష్టసమాగమనిర్వృతిం । వనితయానితయారజనీవధూః॥ ౪౬

అపతుషారతయావిశదప్రభైః । సురతసంగపరిశ్రమనోదిభిః
కుసుమచాపమతేజయదంశుభి । ర్హిమకరోమకరోర్జితకేతనం॥ ౪౭

హుతహుతాశనదీప్తివనశ్రియః । ప్రతినిధిఃకనకాభరణస్యయత్
యువతయఃకుసుమందధురాహితం । తదలకేదలకేసరపేశలం॥ ౪౮

ఆమని నశోకతరువుల ♦ నమరునట్టి । భవ్యసుందరకుసుమవి ♦ భ్రమమెగాక
ప్రియులు మోహింపఁ బ్రియురాండ్రు ♦ వీనులందుఁ। గూర్చు పల్లవపాళియుఁ ♦ గోలిపెబాళి॥

అవ్వసంతుఁడు వనలక్ష్మి ♦ యంగమందుఁ । గూరిచిన పత్రములఁ బోలు ♦ కురువకాళి
యమలమధుదాన దక్షమై ♦ యలరుకతనఁ । గారణంబయ్యె మధుపర్కం ♦ కారమునకు॥

అమలవదనల వదనాస ♦ వమునఁబుట్టి । యట్టిగుణముసె గలవయి ♦ యలరులుంట
వరుసలుగ వచ్చినిండెను ♦ వకుళమందు । మధువునానెడు కాంతుచే ♦ మధుపకులము॥

*విరహిణులుచాల దీర్ఘమై ♦ వెలయుతన్న । హాయిగా దాఁటలేరని ♦ యాత్మయందు
దయఁదలఁచినట్లు చంద్రుతోఁ ♦ దనరురాత్రి । యెంతయును హ్రస్వమయ్యె వ ♦ సంతమందు॥

ననలచేతను గమ్మవా ♦ సనలచేత । నలరు వనములఁ బికములు ♦ తొలుతసలుపు
ముగ్ధవధువుల మితవాక్య ♦ ములనుబోలు । విరళమౌ కూజితమ్ములు ♦ వినఁగనయ్యె॥ ౪౦

భ్రమర రవములు శ్రావ్యమౌ ♦ పాటగాఁగఁ । గాంతసుమరుచిమృదుదంత ♦ కాంతిగాఁగఁ
జేతనభినయమును బట్టు ♦ చెలువుఁజూపెఁ । దలిరుగమిగాలిఁ గదలు ను ♦ ద్యానలతలు॥

తగ్గని విలాసమును గూర్పఁ ♦ దగినయట్టి । పొగడపూ మించువాసన ♦ పొదలునట్టి
పతుల యనురాగమును భంగ ♦ పఱుపనట్టి । స్మరసఖము మధువానిరి ♦ మగువలప్డు॥

*తిలకవృక్షాగ్ర మనుహర్మ్య ♦ తలమునందుఁ । గమ్మపూఁదేనె వాసనల్ ♦ గ్రమ్ముచుండఁ
భృంగములు వేలకొలఁదిగఁ ♦ బ్రియలఁగూడి । హాయిగాఁ బాడె నెంతయు ♦ హర్షమునను॥

నవ్వుమోములు మ్రోసెడు ♦ మువ్వలుండు । జాఱు మొలనూళ్ళు గలయట్టి ♦ సతులకరణి
నలరుదమ్ములు కలరవ ♦ జలఖగాళి । గలిగి చెన్నారు గృహదీర్ఘి ♦ కలు చెలంగె॥ ౪౪

*పొలయలఁకఁబుట్టి మారుఁడు ♦ గోలిపినట్టి । చిరమనోవ్యథ గాసిలు ♦ చేడియలకు
ధైర్యమును జార్చె మదభృంగ ♦ తతులచేత । వంగిపూచిన సహకార ♦ పాదపంబు॥ ౪౫

ఆవసంతుఁడు ఖండింప ♦ రేవెలంది । సోముఁ డుదయింప వెల్లని ♦ మోముపెట్టె
నాఁడునాటికిఁ గృశియించె ♦ నాథుతోడి । సంగమప్రాప్తి కలుగని ♦ చానపగిది॥ ౪౬

మంచులేనట్టి శుభ్రమై ♦ మించునట్టి । జాతనురతశ్రమము దీర్పఁ ♦ జాలునట్టి
చారుకిరణాళిచే నుమ ♦ చాపధరుని । మానకేతనుఁ జలిదెల్గు ♦ మెఱయఁజేసె॥ ౪౭

ప్రజ్వలితవహ్నిఁ బోలెడు ♦ ప్రభలదాని । వనరమకుఁ బైడి నగమాలు ♦ పఱలుదాని
మృదుతరంబగు రేకుల ♦ మించుదానిఁ । గురులఁ బ్రియులిడఁదాల్చి ర ♦ క్కోరిని సతులు॥

అలిభిరంజనబిందుమనోహరైః । కుసుమపంక్తినిపాతిభిరంకితః
నఖలుశోభయతిస్మవనస్థలీం । నతిలకస్తిలకఃప్రమదామివ॥ ౪౯

అమదయన్మధుగంధసనాథయా । కిసలయాధరసంతతయామనః
కుసుమసంభృతయానవమల్లికా । స్మితరుచాతరుచారువిలాసినీ॥ ౫౦

అనలసాన్యభృతానలసాన్మనః । కమలధూళిభృతామరుతేరితా
కుసుమభారనతాధ్వగయోషితా । మసమశోకమశోకలతాకరోత్॥ ౫౧

అరుణరాగనిషేధిభిరంశుకైః । శ్రవణలబ్ధపదైశ్చయవాంకురైః
పరభృతావిరుతైశ్చవిలాసినః । స్మరబలైరబలైకరసాఃకృతాః॥ ౫౨

ఉపచితావయవాశుచిభిఃకణైః । రలికదంబకయోగముపేయుషీ
సదృశకాంతిరలక్ష్యతమంజరీ । తిలకజాలకజాలకమౌక్తికైః॥ ౫౩

ధ్వజపటంమదనస్యధనుర్భృత । శ్ఛవికరంముఖచూర్ణమృతుశ్రియః
కుసుమకేసరరేణుమలివ్రజాః । సపవనోపవనోత్థితమన్వయుః॥ ౫౪

అనుభవన్నవదోలమృతూత్సవం । పటురపిప్రియకంఠజిఘృక్షయా
అనయదాసనరజ్జుపరిగ్రహే । భుజలతాంజలతామబలాజనః॥ ౫౫

త్యజతమానమలంబతవిగ్రహై । ర్నపునరేతిగతంచతురంవయః
పరభృతాభిరితీవనివేదితే । స్మరమతేరమతేస్మవధూజనః॥ ౫౬

అథయథాసుఖమార్తవముత్సవం । సమనుభూయవిలాసవతీసఖః
నరపతిశ్చకమేమృగయారతిం । సమధుమన్మధుమన్మథసన్నిభః॥ ౫౭

పరిచయంచలలక్ష్యనిపాతనే । భయరుషోశ్చతదింగితబోధనం
శ్రమజయాత్ప్రగుణాంచకరోత్యసౌ । తనుమతోనుమతఃసచివైర్యయౌ॥ ౫౮

మృగవనోపగమక్షమవేషభృ । ద్విపులకంఠనిషక్తశరాసనః
గగనమశ్వఖురోద్ధతరేణుభి । ర్నృసవితాసవితానమివాకరోత్॥ ౫౯

ప్రథితమౌళిరసౌవనమాలయా । తరుపలాశసవర్ణతనుచ్ఛదః
తురగవల్గనచంచలకుండలో । విరురుచేరురుచేష్టితభూమిషు॥ ౬౦

తనులతావినివేశితవిగ్రహా । భ్రమరసంక్రమితేక్షణవృత్తయః
దదృశురధ్వనితం వనదేవతాః । సునయనం నయనందితకోసలం॥ ౬౧

అంజనకజ్జాళివలె హృద్య ♦ మైతనర్చి । యాఁకురుబంతిఁ ద్రావెడు ♦ నళులనొప్పు
తిలకవృక్షమ్ముతో వని ♦ తేజరిల్లెఁ । దిలకమునఁ దేజరిలు సతీ ♦ తిలకమట్లు॥ ౪౯

కుజములకుఁ గ్రొత్తసొగసును ♦ గూర్చుచుండి । పొల్చు నవమల్లికాలత ♦ పూలచేతఁ
జిఱునగవుచెల్వుఁజూపుచుఁ ♦ జిగురుపెదవు । లందు మధుగంధమందియా♦నంద మొసఁగె॥

తమ్మిపుప్పొడి దాల్చి వా ♦ తమునఁగదలి । గండుఁగోయిల గుంపులఁ ♦ గ్రాలుచుండి
సుమభృతిని వంగినట్టియ ♦ శోకశాఖ । చిచ్చుగాఁజేసె విరహిణీ ♦ చిత్తములను॥ ౫౧

అరుణకాంతిని మించిన ♦ యంబరములు । చెవులఁ జేర్చిన యాకులవొ ♦ చిఱుమొలకలు
వరశికిరమ్ము లనియెడు ♦ మరుబలములు । చేడియల రాగమునముంచెఁ♦ గోడెకాండ్రి॥

అమల సుమరేణువుల బలు ♦ పండినట్టి । యాయాసము లొప్ప మీఁద భృం♦ గాళిగప్పఁ
దిలకవృక్షపుఁ బూగుత్తి ♦ చెలఁగెఁగాంతిఁ । గురులఁ జేర్చిన మౌక్తికా ♦ భరణమట్లు॥

ధన్వియై యొప్పు దర్పకు ♦ ధ్వజపటంబొ । శోభయుతలక్ష్మి కిడుముఖ♦చూర్ణమొకొ
యనఁగ గాలికి నెగడిన ♦ మందులేచు । సుమరజము వెంటనంటెను ♦ భ్రమరకులము॥

యూవతు లుయ్యేలలను వసం ♦ తోత్సవముల । బాగుగా నూఁగఁగఁగ్గియు ♦ బాహులతలు
పతిని నాలింగనముసేయు ♦ కుతుకమునను । గనె జడిమ పేరరజ్జుల ♦ గ్రహణమందు॥ ౫౫

అలుకమానుఁడు వైరమల్ ♦ తొలఁగివనుఁడు । యౌవనము వోవ నరలరొ ♦ దనెడు వరుని
మతము పికతతిచే విన్న ♦ గతిని సతులు । లలిత కేళీ విలాసముల్ ♦ సలిపిరపుడు॥ ౫౬

మధుహరుని మన్మధుని మతి ♦ మధునిబోలు । మనుజవిభుఁడు విలాసినీ ♦ మణులతోడ
నమ్మధూత్సవ మెలమితో ♦ ననుభవించి । కోరె మృగయావిహారంబుఁ ♦ గూర్మిసలుప॥

ఇటునటుఁ జలించు లక్ష్యమ్ము ♦ లేయఁగలుపు । నలుకవెఱపుల లక్షణ ♦ ములను దెలుపు
నోర్పుమొదలగుగుణముల♦నొడలఁగొలుపు। వేఁటయని మంత్రులొప్పఁగా ♦ వెడలె విభుఁడు॥

వేఁటకనువయిపొల్చెడు ♦ వేషమూని । విపులకరటస్థలమునంట ♦ విల్లుదాల్చి
తురగరింఖాసముద్ధూత ♦ ధూళిఁగొలిపెఁ । గలవడమ్మట్లు నింగి భూ♦కాంతమూలి॥ ౫౯

మహితవనమాలకలితమై ♦ మాళితనగ । మోదుగాకులరంగును ♦ బోలమరున
కులుకు గుఱ్ఱంపుస్వారిపో ♦ గులుచలింప । రురువిహారపుభూమిపై ♦ నటులెఁబ్రభావు॥ ౬౦

తనువులనగూర్చితనులతా ♦ తతులయందుఁ । గంటిచూపులఁజొనిపిళ్ళం ♦ గములయందుఁ
గనిరిభవనదేవతాస్త్రీలు ♦ గమలనయనుఁ । గోనలకుఁ జీత్రితసీతిచేఁ ♦ గొలుపుగన్న॥ ౬౧

శ్వగణివాగురికైః ప్రథమాస్థితం । వ్యపగతానలదస్యువివేశసః
స్థిరతురంగమభూమినిపానవత్ । మృగవయోగవయోపచితంవనం॥ ౬౨

అథనభస్యఇవత్రిదశాయుధం । కనకలింగతటిద్గుణసంగతం
ధనురధిజ్యమనాధిరుపాదదే । నరవరోనవరోషితకేసరీ॥ ౬౩

తస్యస్తనప్రణయిభిర్ముహురేణశావై । ర్వ్యాహన్యమానహరిణీగమనం పురస్తాత్
ఆవిర్బభూవకుశగర్భముఖంమృగాణాం । యూథంతదగ్రసరగర్వితకృష్ణసారం॥ ౬౪

తత్ప్రార్థితంజవనవాజిగతేనరాజ్ఞా । తూణీముఖోద్ధృతశరేణవిశీర్ణపంక్తిః
శ్యామీచకారవనమాకులదృష్టిపాతై । ర్వాతేరితోత్పలదలప్రకరైరివార్ద్రైః॥ ౬౫

లక్ష్యీకృతస్యహరిణస్యహరిప్రభావః । ప్రేక్ష్యస్థితాంసహచరీంవ్యవధాయదేహం
ఆకర్ణకృష్టమపికామితయాసధన్వీ । బాణంకృపామృదుమనాః ప్రతిసంజహార॥ ౬౬

తస్యాపరేష్వపిమృగేషుశరాన్ముముక్షోః । కర్ణాంతమేత్యబిభిదేనిబిడోఽపిముష్టిః
త్రాసాతిమాత్రచటులైఃస్మరయత్సునేత్రైః । ప్రౌఢప్రియానయనవిభ్రమచేష్టితాని॥

ఉత్తస్థుషఃశిశిరపల్వలపంకమధ్యా । న్ముస్తాప్రరోహకబలావయవానుకీర్ణం
జగ్రాహసద్రుతవరాహకులస్యమార్గం । సువ్యక్తమార్ద్రపదపంక్తిభిరాయతాభిః॥ ౬౮

తంవాహనాదవనతోత్తరకాయమీష । ద్విధ్యంతముద్ధతసటాఃప్రతిహంతుమీషుః
నాత్మానమస్యవివిదుః సహసావరాహా । వృక్షేషువిద్ధమిషుభిర్జఘనాశ్రయేషు॥ ౬౯

తేనాభిఘాతరభసస్యవికృష్యపత్రీ । వన్యస్యనేత్రవివరేమహిషస్యముక్తః
నిర్భిద్యవిగ్రహమశోణితలిప్తపుంఖ । స్తంపాతయాంప్రథమమాసపపాతపశ్చాత్॥ ౭౦

ప్రాయోవిషాణపరిమోక్షలఘూత్తమాంగాన్ । ఖడ్గాంశ్చకారనృపతిర్నిశితైఃక్షురప్రైః
శృంగంసదృప్తవినయాధికృతఃపరేషా । మత్యుచ్ఛ్రితంనమమృషేనతుదీర్ఘమాయుః॥ ౭౧

వ్యాఘ్రానభీరభిముఖోత్పతితాన్గుహాభ్యః । ఫుల్లాసనాగ్రవిటపానివవాయురుగ్ణాన్
శిక్షావిశేషలఘుహస్తతయానిమేషాత్ । తూణీచకారశరపూరితవక్త్రరంధ్రాన్॥ ౭౨

నిర్ఘాతోగ్రైః కుంజలీనాన్ జిఘాంసు । ర్జ్యానిర్ఘోషైః క్షోభయామాస సింహాన్
నూనం తేషా మభ్యసూయాపరోఽభూ । ద్వీర్యోదగ్రే రాజశబ్దే మృగేషు॥ ౭౩

తాన్హత్వా గజకులబద్ధ తీవ్రవైరాన్ । కాకుత్స్థః కుటిలనఖాగ్రలగ్నముక్తాన్
ఆత్మానం రణకృతకర్మణాం గజానా । మానృణ్యం గతమివమార్గణై॥ రమంస్త౭౪

వలలుపక్కులుగల పరి ♦ వారమున్న | చిచ్చుమ్రిచ్చుల నెడలి తే ♦ జీలునడుచు
దృఢపథంబులఁ గొలకులఁ ♦ దీఱియున్న | మృగగవయపక్షిమయవని ♦ నృపుఁడుసొచ్చె॥

మించుబంగారుపచ్చని ♦ మెఱపునారి | తనరుసురచాపమునుభాద్రి ♦ దాల్చుకరణి
నెక్కిడినవిల్లుఁగొనెఁజింత ♦ లెఱుఁగనట్టి | హరులఁడంకృతిఁగెరలించు ♦ నట్టినృపతి॥ ౬౩

క్రాలమునుముందునల్లని ♦ గండులేడి | తఱిసిపొదుగులఁదల్లుల ♦ నరుగనీక
మాటికినినాఁపఁబిల్లలు ♦ నోటఁగుశల | నిడికొనిన లేళ్లమంద గ ♦ న్పడియె నెదుట॥ ౬౪

తీసిపొఱియల్గువడిగల ♦ తేజి నెక్కి | క్షితిపుఁడెదురైనఁ జెదరి యా ♦ జింకపిండు
బెదరుతడిమాపులను నల్లఁ ♦ బఱచెననిని | వాయువు వృత్తలదళతతిఁ ♦ బఱమనట్లు॥ ౬౫

హరిసముఁడు తేఁడుగురియిడ్డ ♦ హరిణమునకు | హరిణియడ్డుగఁదనువిడ ♦ నతఁడు స్వయము
కాముకుండౌట మదిదయఁ ♦ గరఁగధన్వి | దింపెశరమును జెవిదాఁకఁ ♦ దీసియున్న॥ ౬౬

అన్యమృగముల నేయ ను ♦ న్నపుడు సూడఁ | జకితతరళంబు లౌకనుల్ ♦ చతురలైన
దయితలవిలాసదృక్కులఁ ♦ దలఁపుగొలుప | నొడయఁడు చెవిసోఁకుదృఢముష్టి ♦ సడలుచండె॥

వన్యసూకరములు తడి ♦ పడియుఁదొఱఁగి | రాలిపడ నోటిగడ్డి శ్రీ ♦ ఘ్రముగఁబాఱ
నడుమునడుగులవరుసలు ♦ పొడవుగాను | బడినపథమును బట్టెను ♦ బార్థివుండు॥ ౬౮

గుఱ్ఱముందుండి పైమేను ♦ గొంతవంచి | పొదుమన్నృపుపయి సటవిచ్చి ♦ పడఁగఁదొడఁగు
నడవిపందు లెఱుంగవు ♦ నడుములాని | తరులఁదామంటఁ బడియుంట ♦ ఁదచ్ఛరముల॥ ౬౯

కడునడినిమీఁదఁ బడవచ్చు ♦ కారెనుమును | బ్రిదరమునుదీసి కంటిరం ♦ ధ్రమున నేయ
గరులనొప్పెడు బ్రాణ మం ♦ గమ్మునర్చ్చి | నెత్తురంటకపడె దాని ♦ నేలఁగూల్చి॥ ౭౦

కఱకుటమ్ముల శృంగభం ♦ గమ్ముసేసి | ఖడ్గమృగశీర్షభారముల్ ♦ కడఁకడించె
దుష్టనిగ్రహుఁడోర్చునే ♦ దుష్టతతుల | యున్నతిఁజిరాయువోర్చిన ♦ నోర్చుఁగాక॥

గాలికాసనపుల్ల శా ♦ ఖాళియట్టు | లెడలిగుహలను బులులేచి ♦ యెదుటఁబడిన
వాఁడుకనుగన్న శరలాఘ ♦ వమున నపుడె | పొదివిశరములనొళ్లను ♦ బొదులఁజేసె॥ ౭౨

పొదలడాగినసింహాళిఁ ♦ జదియ నెంచి | తేఁడుగర్జోగ్రటంకృతి ♦ రేపె వానిఁ
బ్రిబల తేజంబు మృగరాజ ♦ పదముఁజూచి | యెంతయును నాత్మ నోర్వని ♦ హేతువునను॥

వక్రనఖములముత్యముల్ ♦ వఱలుచుండు | సింధురభయంకరారులౌ ♦ సింహములను
జంపి శిరముల నాజిలో ♦ సాయపడిన | హస్తితతి యుప్పుదీఱిన ♦ దంచు నెంచె॥ ౭౪

చమరాన్ పరితః ప్రవర్తితాశ్వః । క్వచిదాకర్ణ వికృష్ట భల్లవర్షీ
నృపతీ నివతాన్వియోజ్య సద్యః । సితబాలవ్యజనైర్జగామశాంతిం॥ ౬౫

అపితురగ సమీపా దుత్పతంతం మయూరం । నసరుచిరకలాపం బాణలక్ష్యీచకార
సపదిగత మనస్క శ్చిత్రమాల్యానుకీర్ణే । రతివిగళిత బంధే కేశపాశే ప్రియాయాః॥

తస్యకర్కశ విహారసంభవం । స్వేదమానన విలగ్నజాలకం
ఆచచామసతుషార శీకరో । భిన్నపల్లవపుటోవనానిలః॥ ౬౬

ఇతివిస్మృతాన్య కరణీయమాత్మనః । సచివావలంబితధురం నరాధిపం
పరివృద్ధరాగ మనుబంధ సేవయా । మృగయాజహార చతురేవకామినీ॥ ౬౭

సలలిత కుసుమప్రవాళ శయ్యాం । జ్వలిత మహౌషధి దీపికాసనాథాం
నరపతి రతివాహయాం బభూవ । క్వచిదసమేత పరిచ్ఛదస్త్రియామాం॥ ౬౮

ఉషసి సగజయూథ కర్ణతాలైః । పటుపటహధ్వనిభిర్వినీతనిద్రః
అరమత మధురాణి తత్రశృణ్వన్ । విహగవికూజిత వందిమంగళాని॥ ౭౦

అథ జాతురురోర్గృహీతవర్త్మా । విపినేపార్శ్వచరైర లక్ష్యమాణః
శ్రమఫేనముచాతపస్విగాఢాం । తమసాం ప్రాపనదీం తురంగమేణ॥ ౭౧

కుంభపూరణభవః పటురుచ్చై । రుచ్చచారనినదోంభసితస్యాః
తత్ర సద్విరదబృంహిత శంకీ । శబ్దపాతినమిషుం విససర్జ॥ ౭౨

నృపతేః ప్రతిషిద్ధమేవతత్ । కృతవాన్పఙ్క్తిరథో విలంఘ్యయత్
అపదేపదమర్పయంతిహి । శ్రుతవంతోపి రజోనిమీలితాః॥ ౭౩

హాతాతేతిక్రందితమాకర్ణ్యవిషణ్ణ । స్తస్యాన్విష్య న్వేతసగూఢప్రభవంసః
శల్యప్రోతం ప్రేక్ష్య సకుంభం మునిపుత్రం । తాపాదంతః శల్యఇవాసీత్క్షితిపోపి॥ ౭౪

తేనావతీర్య తురగాత్ప్రథితాన్వయేన । పృష్టాన్వయః సజలకుంభ నిషణ్ణదేహః
తస్మైద్విజేతరతపస్విసుతం స్ఖలద్భి । రాత్మాన మక్షరపదైః కథయాంబభూవ॥ ౭౫

తచ్చోదితశ్చ తమనుద్ధృత శల్యమేవ । పిత్రోః సకాశమవసన్నదృశోర్నినాయ
తాభ్యాం తథాగతముపేత్య తమేకపుత్ర । మజ్ఞానతః స్వచరితం నృపతిశ్శశంస॥ ౭౬

తౌదంపతీ బహువిలప్య శిశోః ప్రహర్త్రా । శల్యం నిఖాతముదహారయతా మురస్తః
సోభూత్పరాసురథభూమిపతింశశాప । హస్తార్పితైర్నయనవారిభిరేవవృద్ధః॥ ౭౭

తేజిపైఁజమరీమృగ ♦ రాజిమట్టుఁ । దిరిగిశరములఁ జెవిదాఁకఁ ♦ దీసిగురిసి
లీలనెడలించి చామర ♦ వాలములను । దృష్టిఁగనెతేఁడు తక్కిన ♦ నృపతులట్లు॥ ౨౫

వీడిరతికేళివిరిసరుల్ ♦ గూడియుండు । తనసతీకేశపాశముల్ ♦ దలఁపుగొలుప
నెమ్మినేయఁడు నృపుఁడు పిం ♦ ఛమ్ము విప్పి । నశ్వసామీప్యమునఁ జేర ♦ లాఁగుచున్న
కరముబడలిన నృపతిముం ♦ గురులనంటి । వదనమునఁ గ్రాలుచెమటపై ♦ వ్రాలివ్రాలి
చల్లతుంపరతోఁ గూడి ♦ పల్లవములు । విప్పుగొహానాలిలు ముద్దు ♦ వెట్టుకొనియె॥ ౨౬

ఇట్లు కార్యాంతరమ్ముల ♦ నెల్లమఱచి । ధరణిభారమ్ము సచివుల ♦ తలను బెట్టి
యెడతెగని సేవనురాగ ♦ మెచ్చనతఁడు । లోఁగె వేఁటకుఁ జతురకు ♦ లోఁగుపగిది॥ ౨౭

ఒక్కపరిచరుఁడును లేని ♦ యొక్కచోటఁ । దేజరిల్లఁగ నోషధీ ♦ దీపవితతి
పల్లవమ్ముల పువ్వుల ♦ పాన్పుమీఁదఁ । రాత్రిగడపెను దశరథ ♦ రాజమౌళి॥ ౨౮

వనకరులకర్ణతాళముల్ ♦ పటహరవము । లీలఁ జెలఁగిన వేఁకువ ♦ మేలుకాంచి
వందిశుభగీతముల చంద ♦ మొందువిహగ । మధురరుతముల నాలించి ♦ మహిపుఁడలరె॥ ౩౦

లేడివిపినంబులోఁ జన్న ♦ జాడఁబట్టి । పార్శ్వచరులకుఁ దాఁ గనఁ ♦ బడకయుండఁ
జేరె వరపశుమునిజన ♦ సేవ్యఁదమస । నురుగు జడలినగుజ్జము ♦ నోటఁ గాఱ॥ ౩౧

కడవనానదిముంచఁగాఁ ♦ బోడముదీర్ఘ । కలరవమ్మును ద్విరదఘీం ♦ కారమంచు
నెంచియాశబ్దపథము గు ♦ ర్తించివిడిచెఁ । దీవ్రశరమును నరపాల ♦ తిలకమపుడు॥ ౩౨

నృపులకునిషిద్ధమేనియయా ♦ నిట్టిపథము । ధర్మమును దాఁటి మెట్టెను ♦ దశరథుండు
ప్రాజ్ఞులే నిరజోగుణ ♦ బద్ధులైనఁ । బదము నిడుదురు గాదె దు ♦ ష్పథమునందు॥ ౩౩

అంత హా తండ్రి! యనిమెను ♦ నార్తరవము । వినఁబడిన తేఁడు దీనుఁడై ♦ వెదకియచట
వేతసనికూఢు మునిసుతు ♦ విశిఖవిద్ధు । ఘటయుతుఁ గాంచి చింతాగ్ర ♦ ఘటితుఁడయ్యె॥

పత్రిక్షతకులుఁడైన విభుఁడు గు ♦ జ్జంబుడిగ్గి । కులము మునిసుతు నడిగినఁ ♦ గుంభయూని
మాటతడఁబడ నాతఁడు ♦ మాఱుపలికెఁ । దాద్విజేతరతాపస ♦ తనయుఁడంచు॥ ౩౫

అతఁడు గోరఁగ శరముకో ♦ నతని నృపుఁడు । కనులులేనట్టి జనకుల ♦ కడకుఁ దెచ్చి
యేకపుత్రినిముందిడి ♦ యొఱుకపఱిచె । నజ్ఞతను దానొనర్చిన ♦ యట్టితప్పు॥ ౩౬

దంపతులువారలెంతయుఁ ♦ దల్లడిల్లి । హస్తచేతను శరమిదీ ♦ యంగఁజేయఁ
దనయుఁడుగతించె వృద్ధుఁడౌ ♦ జనకుఁడంతఁ । దిట్టఁదొడఁగెను గన్నీరు ♦ పట్టిచేత॥ ౩౭

దిష్టాన్తమాప్స్యతి భవానపి పుత్రశోకా । దన్త్యే వయస్యహమివేతి త ముక్తవన్తం
ఆక్రాన్తపూర్వ మివముక్త విషం భుజంగం । ప్రోవాచ కోసలపతిః ప్రథమాపరాద్ధః॥

శాపోప్యదృష్టతనయానన పద్మశోభే । సానుగ్రహో భగవతామయిపాతితోయం
కృష్యాం దహన్నపి ఖలుక్షితి మిన్ధనేద్ధో । బీజప్రరోహజననీం జ్వలనః కరోతి॥

ఇత్థంగతే గతఘృణః కిమయం విధత్తాం । వధ్యస్త వేత్యభిహితో వసుధాధిపేన
ఏధాన్హుతాశనవతః సమునిర్యయాచే । పుత్రం పరానుమనుగన్తుమనాః సదారః॥

ప్రాప్తానుగః సపదిశాసనమస్యరాజా
సంపాద్యపాతక విలుప్తధృతిర్నివృత్తః
అన్తర్నివిష్టపదమాత్మ వినాశహేతుం
శాపం దధజ్జ్వలన మౌర్వమి వామ్బురాశిః॥ ౮౭

ఇతి శ్రీరఘువంశే మహాకావ్యే కవిశ్రీ కాళిదాసకృతౌ
మృగయావర్ణనో నామ నవమఃసర్గః.



నావలెనె వార్ధకంబున ♦ నీవుగూడఁ । బుత్రశోకంబుచే మృతిఁ ♦ బొందుమంచుఁ
గ్రొక్కనహితోక్తవిషమును ♦ గ్రక్కుకరణిఁ । బల్కెఁ బ్రథమాపరాధిన్ ♦ బాలుఁడనియె॥
నుతునిముఖపద్మకాంతిని ♦ జూడనట్టి । నాకు మీయిట్టి దీవెన ♦ నాఁ దనర్చె
నగ్నికణములతో మండి ♦ యవనితలముఁ । గాల్చినన్ సస్యహేతువై ♦ గ్రాలుఁ గాదె॥ ౮౯
వధ్యుఁడనుమీకుఁ గరుణావి ♦ వర్జితుండ । నేమి సెలవనియడుఁగ భూ ♦ మీశునతఁడు
నుతునికడ కేగెదను నాదు ♦ సతినిగూడి । కూర్పుమా కగ్ని నీవని ♦ కోరెమాని॥ ౯౦

చ॥ అనుచరరాజిఁబంచి ముని ♦ యానతిఁదీర్చి తత్క్షణంబ య
జ్జనపతిమళ్ళెఁ బాపమున ♦ స్వాంతముశాంతముఁ బాయ నాత్మలోఁ
దననిరయంపుఁగారణము ♦ తాపసుశాపము వేరుపాఱఁగా
ఘనబడబానలంబుగల ♦ కంధినిబోలుచు రాజధానికిన్॥ ౯౧

గద్య.

ఇది శ్రీపరమేశ్వరకరుణాఫలిత లలితకవితాకలిత శ్రీరామలక్ష్మాంబా
బుచ్చివేంకయామాత్యతనూజాత సకలసజ్జనవిధేయ ఆదిపూడి
సోమనాధనామధేయప్రణీతంబయిన యాంధ్రరఘువం
శంబునందు మృగయావర్ణనంబను
నవమాశ్వాసము సంపూర్ణము.





శ్రీ

# రఘువంశమ్

## దశమః సర్గః

---

పృథివీం శాసతస్తస్య । పాకశాసనతేజసః
కించిదూనమనూనర్ద్ధేః । శరదామయుతం యయౌ॥ ౧

నచోపలేభే పూర్వేషా । మృణనిర్మోక్షసాధనం
సుతాభిధానం సజ్యోతిః । సద్యః శోకతమోపహం॥ ౨

*మనోర్వంశశ్చిరం తస్మి । న్ననభివ్యక్తసంతతిః
నిమజ్య పునరుత్థాస్య । న్నదః శోణ ఇవాభవత్॥ ౩

అతిష్ఠత్ప్రత్యయాపేక్ష । సంతతిః స చిరం నృపః
ప్రాఙ్మన్థాదనభివ్యక్త । రత్నోత్పత్తిరివార్ణవః॥ ౪

ఋష్యశృంగాదయస్తస్య । సంతః సంతానకాంక్షిణః
ఆరేభిరే జితాత్మనః । పుత్రీయామిష్టిమృత్విజః॥ ౫

తస్మిన్నవసరే దేవాః । పౌలస్త్యోపప్లుతా హరిం
అభిజగ్ముర్నిదాఘార్తా । శ్ఛాయావృక్షమివాధ్వగాః॥ ౬

తేచ ప్రాపురుదన్వంతం । బుబుధే చాదిపూరుషః
అవ్యాక్షేపో భవిష్యన్త్యాః । కార్యసిద్ధేర్హి లక్షణం॥ ౭

భోగిభోగాసనాసీనం । దదృశుస్తం దివౌకసః
తత్ఫణామండలోదర్చి । ర్మణిద్యోతితవిగ్రహం॥ ౮

శ్రియః పద్మనిషణ్ణాయాః । క్షౌమాంతరితమేఖలే
అంకే నిక్షిప్తచరణ । మాస్తీర్ణకరపల్లవే॥ ౯



శ్రీ

# రఘువంశము.

## దశమాశ్వాసము.

### గీతములు.

పాకశాసన తేజోవి ♦ భాసితుండు । ధనసమృద్ధిని గాంచిన ♦ దశరథుండు
ధరణి నేలంగ నించుక ♦ తక్కువగను । దశసహస్రింపుఁ గొలఁది య ♦ బ్దములు గడచె॥ ౧

కాని యా నృపరత్నంబు ♦ గాంచఁడయ్యె । సంతతపితౄణనిర్ముక్తి ♦ సాధనంబు
పరమశోకాంధకార ని ♦ వారణంబు । సుతుఁడనెడు శుభ్రతేజంబు ♦ శుభకరంబు॥ ౨

*అప్పటికిఁ జూడ నెంతయు ♦ నణఁగి తఱిని । బాఱునుండెడు శోణాకై ♦ వడిని దోఁచె
సంతు గాంచని దశరథే ♦ శ్వరుని యందు । నణఁగియుండెడు మనునృపు ♦ నన్వయంబు॥ ౩

తఱచుటకు ముందు రత్నసం ♦ తతికి నైన । కారణము నరు వేఁచిన ♦ కంధివోలెఁ
జాలకాలము వేఁచెను ♦ సంతతికిని । దగిన కారణమునకయి ♦ ధరణిధవుఁడు॥ ౪

ఋష్యశృంగాదినిర్జితేం ♦ ద్రియులు బుధులు । సంతతిని గోరు దశరథ ♦ జనపమణికిఁ
దగిన పుత్త్రులు గలుగఁగా ♦ ధర్మశోధని । యాగమొనరింపఁ దొడఁగిరి ♦ యాజ్ఞికులుగ॥ ౫

అపుడు పౌలస్త్యుబాధచే ♦ నమరులరిగి । హరికి శరణంబు సొచ్చిరి ♦ యార్తులగుచు
మండువేసవియందలి ♦ యెండవడికి । బడలి ఛాయాతరువుఁ జేరు ♦ పాంథులట్లు॥ ౬

అర్ణవము వారు చేరిన ♦ యాక్షణంబ । పాలకుండాదిపురుషుఁడు ♦ మేలుకాంచె
భావికార్యార్థసిద్ధికి ♦ భవ్యమైన । లక్షణము కాదె చూడ జా ♦ లమ్ము లేమి॥ ౭

ఆదిశేషుని తనువున ♦ నలరువానిఁ । బఱపు పడగలమణికాంతి ♦ పటలములను
నిగనిగలనీను దేహంపు ♦ నిగ్గువానిఁ । గాంచె నానందమున దివౌ ♦ కశ్చయంబు॥ ౮

క్రొత్తమొలనూలు మేలుదు ♦ కూలమమరు । నబ్జపీఠస్థయౌ లక్ష్మి ♦ యంకమందుఁ
బరమశోభల తత్కర ♦ పల్లవములఁ । జాఁచియున్నట్టిచరణ కం ♦ జములవాని॥ ౯

ప్రబుద్ధపుండరీకాక్షం । బాలాతపనిభాంశుకం
దివసంశారదమివ । ప్రారంభసుఖదర్శనం॥ ౧౦

ప్రభానులిప్తశ్రీవత్సం । లక్ష్మీవిభ్రమదర్పణం
కౌస్తుభాఖ్యమపాంసారం । బిభ్రాణంబృహతోరసా॥ ౧౧

బాహుభిర్విటపాకారై । ర్దివ్యాభరణభూషితైః
ఆవిర్భూతమపాంమధ్యే । పారిజాతమివాపరం॥ ౧౨

దైత్యస్త్రీగండలేఖానాం । మదరాగవిలోపిభిః
హేతిభిశ్చేతనావద్భి । రుదీరితజయస్వనం॥ ౧౩

ముక్తశేషవిరోధేన । కులిశవ్రణలక్ష్మణా
ఉపస్థితం ప్రాంజలినా । వినీతేనగరుత్మతా॥ ౧౪

యోగనిద్రాంతవిశదైః । పావనైరవలోకనైః
భృగ్వాదీననుగృహ్ణంతం । సౌఖశాయనికానృషీన్॥ ౧౫

ప్రణిపత్యసురాస్తస్మై । శమయిత్రేసురద్విషాం
అథైనంతుష్టువుస్తుత్య । మవాఙ్మనసగోచరం॥ ౧౬

నమోవిశ్వసృజేపూర్వం । విశ్వంతదనుబిభ్రతే
అథవిశ్వస్యసంహర్త్రే । తుభ్యంత్రేధాస్థితాత్మనే॥ ౧౭

రసాంతరాణ్యేకరసం । యథాదివ్యంపయోశ్నుతే
దేశేదేశేగుణేష్వేవ । మవస్థాస్త్వమవిక్రియః॥ ౧౮

*ఏకఃకారణతస్తాంతా । మవస్థాంప్రతిపద్యసే
నానాత్వంరాగసంయోగాత్ । స్ఫాటికస్యేవదృశ్యతే॥ ౧౯

అమేయోమితలోకస్త్వ । మనర్థీప్రార్థనావహః
అజితోజిష్ణురత్యంత । మవ్యక్తోవ్యక్తకారణం॥ ౨౦

హృదయస్థమనాసన్న । మకామంత్వాంతపస్వినం
దయాళుమనఘస్పృష్టం । పురాణమజరంవిదుః॥ ౨౧

సర్వజ్ఞస్త్వమవిజ్ఞాతః । సర్వయోనిస్త్వమాత్మభూః
సర్వప్రభురనీశస్త్వ । మేకస్త్వంసర్వరూపభాక్॥ ౨౨

అలరువెలిదమ్మికన్నుల ♦ నలరువాని । వఱలులేయెండఁబోలెడు ♦ వలువ వాని
శారదదినాధివలెయోగి ♦ జనులకెపుడు । చూడఁజూడఁగనొప్పెడు ♦ సొబగువాని॥ ౧౦

తళుకుశ్రీవత్సమునకుఁదాఁ ♦ గొలుపునట్టి । పద్మ కానందమునురమై ♦ పరఁగునట్టి
జలధిసారంబునానొప్పి ♦ చెలఁగునట్టి । కౌస్తుభమువక్షమునఁదాల్చి ♦ క్రాలువాని॥ ౧౧

దివ్యభూషణదీప్తిచేఁ ♦ దేజరిల్లి । విటపములఁబోలుబాహువుల్ ♦ వెలయుకతనఁ
గడలినడుమనుమరలఁదాఁ ♦ బొడమినట్టి । పారిజాతంబువలెఁగడు ♦ వఱలువాని॥ ౧౨

దానవస్త్రీలచెక్కిళ్లఁ ♦ దనరుచుండు । మదముచేఁగల్గురక్తిమ ♦ మాపునట్టి
జీవముంగలశస్త్రాళి ♦ చేతఁగలుగు । దశదిశలఁబొల్చుజయనినా ♦ దములవాని॥ ౧౩

పగనహీంద్రునితోమాని ♦ పరఁగునట్టి । కులిశఘాతాంకములచేతఁ ♦ జెలఁగునట్టి
వినతుఁడైకేలుమోడ్చి సే ♦ వించునట్టి । గరుడుఁడుండెడుకొల్వులోఁ ♦ గ్రాలువాని॥

సుఖశయనప్రశ్నసలిపెడు ♦ శుద్ధమతుల । భృగువుమొదలైనవారల ♦ విశదవిమల
యోగనిద్రాంతదృక్కుల ♦ నొప్పుమీఱఁ । గాంచిధన్యులఁజేయుచు ♦ మించువాని॥

వాఙ్మనంబులకందక ♦ వఱలువానిఁ । బొగడయోగ్యునిభగవంతుఁ ♦ బొగడిరపుడు
సురరిపులమానజీవముల్ ♦ సూరగొనెడు । వల్లభునియంఘ్రులకుఁబ్రే ♦ మిల్లిసురలు॥

మొదటవిశ్వముసృజియించి । పిదపదానిఁ । బోషణమొనర్చికడపట ♦ బ్రుంగఁజేయు
త్రివిధరూపాత్మకుండైన ♦ దేవనీకు । భక్తిసల్పుచునున్నాము ♦ వందనములు॥ ౧౭

తొలుతదివినుండిజాఱెడు ♦ జలమునందు । నొక్కటేరుచియున్నను ♦ బెక్కులైన
దేశములమాఱునట్టులు ♦ త్రిగుణములను । మాఱుదువుమార్పులేనట్టి ♦ మహితుఁడీవు॥ ౧౮

*పెక్కులైనయుపాధుల ♦ నొక్కఁడయ్యు । వివిధరూపాలఁగనఁబడి ♦ వెలయుదీవు
స్ఫటికయాయాయిరంగుల ♦ వస్తువులను । బట్టి పలువితములఁగానఁ ♦ బడెడువట్లు॥ ౧౯

కొలఁతకందవులోకముల్ ♦ గొలుతువీవు । కోరికలులేవు తీర్తువు ♦ కోర్కులెల్ల
నజితుఁడవునీకుజయమగు ♦ నన్నికడల । వ్యక్తకారణుఁడగుదువ ♦ వ్యక్తుఁడగుచు॥ ౨౦

ప్రాజ్ఞులాత్మస్థుఁడైన దూ ♦ రస్థుఁడంచు । వాంఛలేశమ్ములేనిత ♦ పస్వియంచు
వగకుఁజిక్కనిపరమకృ ♦ పాళువంచు । నిన్నుజరలేనివృద్ధంచు ♦ నెన్నుచుంద్రు॥ ౨౧

తెలివికందక యన్నియుఁ ♦ దెలియుదీవు । అన్నిటికినీకుఁగారణం ♦ బగుదువీవు
ప్రభురహితుఁడైనయందఱి ♦ ప్రభుఁడవీవు । ఒక్కరుఁడవన్నిరూపాల ♦ నొప్పుదీవు॥

సప్తసామోపగీతం త్వాం । సప్తార్ణవజలేశయం
సప్తార్చిర్ముఖమాచఖ్యుః । సప్తలోకైకసంశ్రయం॥ ౨౩

చతుర్వర్గఫలం జ్ఞానం । కాలావస్థాశ్చతుర్యుగాః
చతుర్వర్ణమయో లోక । స్త్వత్తః సర్వం చతుర్ముఖాత్॥ ౨౪

అభ్యాసనిగృహీతేన । మనసా హృదయాశ్రయం
జ్యోతిర్మయం విచిన్వంతి । యోగినస్త్వాం విముక్తయే॥ ౨౫

అజస్య గృహ్ణతో జన్మ । నిరీహస్య హతద్విషః
స్వపతో జాగరూకస్య । యాథార్థ్యం వేద కస్తవ॥ ౨౬

శబ్దాదీన్విషయాన్భోక్తుం । చరితుం దుశ్చరం తపః
పర్యాప్తోసి ప్రజాః పాతు। మౌదాసీన్యేన వర్తితుం॥ ౨౭

బహుధాప్యాగమైర్భిన్నాః । పంథానః సిద్ధిహేతవః
త్వయ్యేవ నిపతంత్యోఘా । జాహ్నవీయా ఇవార్ణవే॥ ౨౮

త్వయ్యావేశితచిత్తానాం । త్వత్సమర్పితకర్మణాం
గతిస్త్వం వీతరాగాణా । మభూయః సన్నివృత్తయే॥ ౨౯

ప్రత్యక్షోప్యపరిచ్ఛేద్యో । మహ్యాదిర్మహిమా తవ
ఆప్తవాగనుమానాభ్యాం । సాధ్యం త్వాం ప్రతి కా కథా॥ ౩౦

కేవలం స్మరణేనైవ । పునాసి పురుషం యతః
అనేన వృత్తయః శేషా । నివేదితఫలాస్త్వయి॥ ౩౧

ఉదధేరివ రత్నాని । తేజాంసీవ వివస్వతః
స్తుతిభ్యో వ్యతిరిచ్యంతే । దూరాణి చరితాని తే॥ ౩౨

అనవాప్తమవాప్తవ్యం । న తే కించన విద్యతే
లోకానుగ్రహ ఏవైకో । హేతుస్తే జన్మకర్మణోః॥ ౩౩

మహిమానం యదుత్కీర్త్య । తవ సంహ్రియతే వచః
శ్రమేణ తదశక్త్యా వా । న గుణానామియత్తయా॥ ౩౪

ఇతి ప్రసాదయామాసు । స్తే సురాస్తమధోక్షజం
భూతార్థవ్యాహృతిః సా హి । న స్తుతిః పరమేష్ఠినః॥ ౩౫

సప్తసామంబులునునిన్నె ♦ సంస్తుతించు । సప్తజలధులునీకగు ♦ శయనతలము
సప్తలోకంబులకునీవు ♦ సంశ్రయంబు । సప్తజిహ్వుఁడునీకునా ♦ స్యమనియందురు॥

నాల్గుపురుషార్థములఫల ♦ జ్ఞానమెల్ల । నాలుగుయుగంబులమరెడు ♦ కాలమెల్ల
నాల్గువర్ణంబులొప్పుజ ♦ నంబులెల్లఁ । గలుగునీనుండియేకద ♦ నలువదేవ॥ ౨౪

సంతతాభ్యాసనిగ్రహ ♦ స్వాంతములను । హృదయపద్మస్థతేజమై ♦ యొసఁగునిన్ను
మోక్షసామ్రాజ్యమునకును ♦ ముక్షులైన । యోగులందఱుధ్యానించు ♦ చుందురు దేవ॥

జన్మమెత్తుచునుందువ ♦ జన్ముఁడయ్యు । రిపులఁదెగటార్చెదవుని ♦ ష్క్రియుఁడవయ్యు
నుండుదువునిద్రజాగరూ ♦ కుండవయ్యు । నీయథాస్థితిఁదెలియంగ ♦ నేర్చునెవఁడు॥ ౨౬

అధిపశబ్దాదివిషయంబు ♦ లనుభవింప । నధికదుశ్చరమౌ తప ♦ మాచరింపఁ
బ్రజలఁబెంపఁ దటస్థభా ♦ వమువహింప । మహిమగలయట్టిసర్వస ♦ మర్థుఁడీవు॥ ౨౭

శాస్త్రములయందుఁబురుషార్థ ♦ సాధకములు । భిన్నభిన్నమ్ములుగనున్న ♦ నన్నికడకు
నైక్యమందునునీలోన ♦ నబ్ధియందు । నఖిలగంగాప్రవాహమ్ము ♦ లొ తెఱఁగున॥ ౨౮

స్వాంతమునుబెట్టినీయందు ♦ సకలమైన । కర్మములునీకునర్పింపఁ ♦ గలిగినట్టి
వీతరాగులయోగుల ♦ విమలమతుల । కామితంబైన ముక్తికి ♦ గతివినీవు॥ ౨౯

భూమిముఖభూతములనీదు ♦ భూరిమహిమ । గోచరంబయ్యు వాచామ♦గోచరమగు
నింక నూహ ౙశ్రుతుల నూ♦హింపఁదగిన । నిన్నుఁదెలియంగనెవ్విధి ♦ నేర్చునెవఁడు॥

స్మరణచేసినమాత్రన ♦ నరుననీవు । పావనునొనర్చుచుందువు ♦ పరమపురుష
యిదియెతెలుపునుగాదె యిం ♦ కెట్టిఫలము । దర్శనాదులఁగలుగునో ♦ ధన్యచరిత॥ ౩౧

రత్ననిలయంబునందలి ♦ రత్నరాజి । తరణిలోపలనొప్పెడు ♦ కిరణచయము
గణనకందకదూరమై ♦ క్రాలుకరణి । నీచరిత్రం బవాఙ్మనో ♦ గోచరంబు॥ ౩౨

అన్నియుంబొందియుండెడు ♦ నధిపనీకుఁ । బొందఁగాఁగోరునదియున్నె ♦ పూర్ణపురుష
జన్మకర్మమ్ములనునీవు ♦ జగతిఁదాల్చు । టెల్లలోకమ్ములననుగ్ర ♦ హింపఁగాక॥ ౩౩

దేవభవదీయదివ్యప్ర ♦ భావగరిమఁ బొగడివాక్కులుకొఱవడి ♦ పోదలకుంట
బడలికనో శక్తిలేకయొ ♦ పొడముఁగాని । త్వద్గుణావధిఁగాంచుట ♦ వలనఁగాదు॥ ౩౪

అయ్యధోక్షజువిష్ణుని ♦ య్యందమందు । వినుతులఁబ్రసన్నుఁగాఁజేసి ♦ కొనిరిసురలుం
కానిసురమేష్ఠికవినుతుల్ ♦ గాకయతని । నైజగుణబోధకముగఁజె ♦ న్నారుచుండె॥

తస్మైకుశలసంప్రశ్న । వ్యంజితప్రీతయేసురాః
భయమప్రలయోద్వేలా । దాచఖ్యుర్నైఋతోదధేః॥ ౩౬

అథవేలాసమాసన్న । శైలరంధ్రానువాదినా
స్వరేణోవాచభగవాన్ । పరిభూతార్ణవధ్వనిః॥ ౩౭

పురాణస్యకవేస్తస్య । వర్ణస్థానసమీరితా
బభూవకృతసంస్కారా । చరితార్థైవభారతీ॥ ౩౮

బభౌసదశనజ్యోత్స్నా । సావిభోర్వదనోద్గతా
నిర్యాతశేషాచరణా । ద్గంగేవోర్ధ్వప్రవర్తినీ॥ ౩౯

జానేవోరక్షసాక్రాంతా । వనుభావపరాక్రమౌ
అంగినాంతమసేవోభౌ । గుణౌప్రథమమధ్యమౌ॥ ౪౦

విదితంతప్యమానంచ । తేనమేభువనత్రయం
అకామోపనతేనేవ । సాధోర్హృదయమేనసా॥ ౪౧

కార్యేషుచైకకార్యత్వా । దభ్యర్థ్యోస్మినవజ్రిణా
స్వయమేవహివాతోగ్నేః । సారథ్యంప్రతిపద్యతే ౪౨

స్వాసిధారాపరిహృతః । కామచక్రస్యతేనమే
స్థాపితోదశమోమూర్ధా । లభ్యాంశఇవరక్షసా॥ ౪౩

స్రష్టుర్వరాతిసర్గాత్తు । మయాతస్యదురాత్మనః
అత్యారూఢంరిపోఃసోఢం । చందనేనేవభోగినః॥ ౪౪

ధాతారంతపసాప్రీతం । యయాచేసహిరాక్షసః
దైవాత్సర్గాదవధ్యత్వం । మర్త్యేష్వాస్థాపరాఙ్ముఖః॥ ౪౫

సోహందాశరథిర్భూత్వా । రణభూమేర్బలిక్షమం
కరిష్యామిశరైస్తీక్ష్ణై । స్తచ్ఛిరఃకమలోచ్చయం॥ ౪౬

అచిరాద్యజ్వభిర్భాగం । కల్పితంవిధివత్పునః
మాయావిభిరనాలీఢ । మాదాస్యధ్వేనిశాచరైః॥ ౪౭

వైమానికాః పుణ్యకృత । స్త్యజంతుమరుతాంపథి
పుష్పకాలోకసంక్షోభం । మేఘావరణతత్పరాః॥ ౪౮

కుశలసంప్రశ్న మొనరించి ♦ కూర్మి నెఱపి । నట్టివానికిహరికి న ♦ య్యమరులపుడు
ప్రళయమొందక రాక్షస ♦ జలధిపొంగి । కలుగఁజేయువిపత్తును ♦ దెలిపిరంత॥ ౩౬

అబ్ధితీరాన శైలగు ♦ హాంతరమునఁ । గలుగునట్టిప్రతిధ్వని ♦ కరణిఁగ్రాలి
జలధిఘోషంబుఁదెగడును ♦ స్వరముతోడఁ । బలికెభగవంతుఁడతులకృ ♦ పాపయోధి॥

అప్పురాణకవీంద్రుని ♦ యందునుండి । తగినవర్ణస్థలంబులఁ ♦ దరలుచుండి
విమలసంస్కారమునుబొంది ♦ వెలయునట్టి । భారతి కృతార్థురాలైన ♦ పగిదిఁదోఁచె॥

అంఘ్రిఁబ్రవహించిమిగిలిన ♦ యమలగంగ । యూర్ధ్వముఖమునఁబ్రవహించు ♦ నోజనొప్పె
దంతరుచిచంద్రికలతోడఁ ♦ దనరుచుండు । పూతమైనట్టివిభునివా ♦ క్పూరమిట్లు॥ ౩౯

తనువుదాల్చినవారిలోఁ ♦ దనరుసత్త్వ । గుణరజోగుణములఁదమో ♦ గుణమడంచు
కరణియుష్మత్ప్రభావవి ♦ క్రమములెల్ల । నడఁచెరాక్షసుఁడెఱుఁగుదు ♦ నమరులార॥ ౪౦

సాధువ్రమనంబు తెలియక ♦ సలిపినట్టి । పాతకముచేతఁదప్తమా ♦ పగిదినిపుడు
దనుజుచేమజ్జగంబులు ♦ తప్తమగుట । తెలిసియున్నదినాకునో ♦ త్రిదశులార॥ ౪౧

ఏకకార్యార్థపరులమై ♦ యొసఁగుచుండ । వజ్రియిక్కార్యములవేఁడ ♦ వలెనెనన్ను
వహ్నిప్రార్థింపకయొ గాలి ♦ స్వయముగాను । బూనదే దానిసారథ్య ♦ మునుదలంప॥ ౪౨

దనుజపతిదనశితఖడ్గ ♦ ధారకిడక । నాదుచక్రంబుచేతను ♦ నఱకఁదగిన
భాగముగనిల్పియున్నాఁడు ♦ పదిలముగను । దనదుపదియవశిరమును ♦ దథ్యమరయ॥

బ్రహ్మయొసఁగినయట్టివ ♦ రమ్ముకతన । నద్దురాత్ముఁనిదశకంఠు ♦ నమితవృద్ధి
నింతవఱకును నేసహి ♦ యింపవలసె । నరగవృద్ధిని జందన ♦ మోర్చునట్లు॥ ౪౪

తపమునకుఁబ్రీతుఁడైనట్టి ♦ ధాతఁగూర్చి । మనుజులను లెక్కసేయని ♦ దనుజవిభుఁడు
దానుమరణంబుసురలచే ♦ తను జగానఁ । బడయకుండెడునట్లుగా ♦ వరమువేఁడె॥ ౪౫

దశరథనృపాలతనయుఁడై ♦ ధరణిఁబుట్టి । యుద్ధరంగమునకుఁగడు ♦ యోగ్యమైన
బలిగనర్పింతువానివౌ ♦ తలల నేను । గమలచయముగశితశర ♦ కాండములను॥ ౪౬

తడవులేదింకమరలన ♦ ధ్వరములందు । విధివిహితరీతియాజ్ఞికుల్ ♦ వేల్చునట్టి
యాధము లోమాయరక్కసు ♦ లంటనట్టి । పరహవిర్భాగములమీరు ♦ వడయఁగలరు॥ ౪౭

అంబుదముచాటుగాఁగొని ♦ యంబరమున । వెలుపునవిమానములనెక్కి ♦ తిరుగుమీరు
పుష్పకాలోకసంక్షోభ ♦ మునుదొలఁగి । సుకముగానుండుఁడింకనో ♦ సుకృతులార॥

మోక్ష్యధ్వే స్వర్గబందీనాం । వేణీబంధానదూషితాన్
శాపయంత్రితపౌలస్త్య । బలాత్కారకచగ్రహైః॥ ౪౯

రావణావగ్రహక్లాంత । మితివాగమృతేనసః
అభివృష్యమరుత్సస్యం । కృష్ణమేఘస్తిరోదధే॥ ౫౦

పురుహూతప్రభృతయః । సురకార్యోద్యతంసురాః
అంశైరనుయయుర్విష్ణుం । పుష్పైర్వాయుమివద్రుమాః॥ ౫౧

అథతస్యవిశాంపత్యు । రంతేకామ్యస్యకర్మణః
పురుషఃప్రబభూవాగ్నే । ర్విస్మయేనసహర్త్విజాం॥ ౫౨

హేమపాత్రగతందోర్భ్యా । మాదధానఃపయశ్చరుం
అనుప్రవేశాదాద్యస్య । పుంసస్తేనాపిదుర్వహం॥ ౫౩

ప్రాజాపత్యోపనీతంత । దన్నంప్రత్యగ్రహీన్నృపః
వృషేవపయసాంసార । మావిష్కృతముదన్వతా॥ ౫౪

అనేనకథితారాజ్ఞో । గుణాస్తస్యాన్యదుర్లభాః
ప్రసూతించకమేతస్మిం । స్త్రైలోక్యప్రభవోఽపియత్॥ ౫౫

సతేజోవైష్ణవంపత్న్యో । ర్విభేజేచరుసంజ్ఞితం
ద్యావాపృథివ్యోఃప్రత్యగ్ర । మహర్పతిరివాతపం॥ ౫౬

అర్చితాతస్యకౌసల్యా । ప్రియాకేకయవంశజా
అతఃసంభావితాంతాభ్యాం । సుమిత్రామైచ్ఛదీశ్వరః॥ ౫౭

తేబహుజ్ఞస్యచిత్తజ్ఞే । పత్న్యౌపత్యుర్మహీక్షితః
చరోరర్ధార్ధభాగాభ్యాం । తామయోజయతాముభే॥ ౫౮

సాహిప్రణయవత్యాసీత్ । సపత్న్యోరుభయోరపి
భ్రమరీవారణస్యేవ । మదనిష్యందలేఖయోః॥ ౫౯

తాభిర్గర్భఃప్రజాభూత్యై । దధ్రేదేవాంశసంభవః
సౌరీభిరివనాడీభి । రమృతాఖ్యాభిరమ్మయః॥ ౬౦

సమమాపన్నసత్త్వాస్తా । రేజురాపాండురత్విషః
అంతర్గతఫలారంభాః । సస్యానామివసంపదః॥ ౬౧

పరసతీకచములబల్మిఁ ♦ బట్టకుండ । శాపమునఁగట్టువడిపశా♦స్యములవాఁడు
మైలపఱుపనిదేవబం ♦ దీలజడల । ముడులవదలింపుఁడెంతయు ♦ ముదముతోడ॥ ౪౯

రావణావగ్రహముచేఁ గ♦రమ్మువాఁడు । నమరసస్యాళిమీఁద వా♦గమృతవృష్టి
నివ్విధంబునఁగురిసియ♦కృష్ణమేఘ । మెంతయునువింతదోఁప న♦దృశ్యమయ్యె॥ ౫౦

ఉచితసురకార్యమందు ను♦ద్యుక్తుఁడైన । విష్ణువును దేవవిభుఁడావె ♦ విబుధులెల్ల
సమగమించిరితమతమ ♦ యంశములను । విరులతోఁ గాలివెనుజను ♦ తరులపగిది॥ ౫౧

అంతదశరథుకామ్యాధ్వ♦రాంతమందు । సకలఋత్విగ్గణంబు వి♦స్మయమునొంద
నగ్నిలోనుండివొడమె మ♦హాత్ముఁడొకఁడు । పరమదివ్యాంశశోభిత ♦ పురుషవరుఁడు॥

ఆప్రభుండాద్యుఁ డందున♦సుప్రవిష్టుఁ । డగుటఁదనకునుదుర్వహ ♦ మైనయట్టి
స్వర్ణపాత్రంబులోపలి ♦ పాయసంబు । నతఁడు గేలనుదాలిచి ♦ యలరుచుండె॥ ౫౩

అప్రజాపతియొసఁగిన ♦ యన్నమంత । వాసవుఁడువార్ధిలోపలి ♦ వారిసార
మైనయమృతంబుగొన్నట్టి ♦ యందమందు । నన్నృపాలుఁడుగొనెఁగడు ♦ హర్షమునను॥

మూఁడుజగములఁబుట్టించు ♦ వాఁడుగూడఁ । బుత్రుఁడైయాతనికిఁదాను ♦ బుట్టఁగోరెఁ
గానరాజుసుకృతంబు ♦ గలుగఁగలదె । యన్యులకునంచునుడివిరి ♦ యార్యులెల్ల॥

చరువునానొప్పు విష్ణుతే♦జంబునతఁడు । భార్యలిరువురకప్పుడు ♦ పంచిపెట్టె
నరుణకిరణుఁడుదాను బా♦లాతపంబు । దివిభువులఁబంచిపెట్టెడు ♦ తీరుదోఁప॥ ౫౬

తనకుఁగౌసల్యమాన్యయై ♦ తనరుకతనఁ । గైకయెంతయుఁబ్రియయయి ♦ క్రాలుకతన
వారిఁగోరెనుమిత్రకు ♦ వారివారి । భాగమిడి గారవింపంగ ♦ భర్తయపుడు॥ ౫౭

అన్నియునెఱింగిచిత్తజ్ఞుఁ ♦ డైనమగని । యిష్టమునుబట్టియబ్భార్య ♦ లిరువురంతఁ
జెలిసగముసేసితమపాలి ♦ చరువునందు । మించుప్రేమనుదాని సు♦మిత్రకిడిరి॥ ౫౮

ఆమెయిమ్మువ్వురుసతుల ♦ యందుఁబ్రేమ । సమముగాఁజూపుచుండెఁబ్ర♦సన్నమతిని
గరికినిరుప్రక్కఁగటములఁ♦గాఱుమదము । సమముగానెఱించిప్రేమించు ♦ భ్రమరిమాడ్కి॥

అర్కకిరణమ్ములనునాడు ♦ లమృతమనెడు । సలిలగర్భముధరియించు ♦ సరణివారు
జనులసిరికయిదేవాంశ ♦ జనితమైన । గర్భమునుదాల్చిరెంతయుఁ ♦ గ్రాలిరపుడు॥

ఫలములనులోనవహియించి ♦ ప్రబలుమంచు । సస్యసంపదతోఁబోల్పఁ ♦ జాలిరాణు
లాకృమాఱుగగర్భమ్ము ♦ లొందిమిగులఁ । దెల్లఁబాఱినతనులతోఁ ♦ దేజరిల్లిరి॥ ౬౧

గుప్తం దదృశు రాత్మానం । సర్వాః స్వప్నేషు వామనైః
జలజాసిగదాశార్ఙ్గ । చక్రలాంఛితమూర్తిభిః॥ ౬౨

హేమపక్షప్రభాజాలం । గగనే చ వితన్వతా
ఉహ్యాం తేస్మ సుపర్ణేన । వేగాకృష్టపయోముచా॥ ౬౩

బిభ్రత్యాః కౌస్తుభం న్యాసం । స్తనాంతరవిలంబినం
పర్యుపాస్యంత లక్ష్మ్యా చ । పద్మవ్యజనహస్తయా॥ ౬౪

కృతాభిషేకై ర్దివ్యాయాం । త్రిస్రోతసి చ సప్తభిః
బ్రహ్మర్షిభిః పరం బ్రహ్మ । గృణద్భి రుపతస్థిరే॥ ౬౫

తాభ్య స్తథావిధాన్ స్వప్నాన్ । శ్రుత్వా ప్రీతో హి పార్థివః
మేనే పరార్ధ్యమాత్మానం । గురుత్వేన జగద్గురోః॥ ౬౬

విభక్తాత్మా విభు స్తాసా । మేకః కుక్షిష్వనేకధా
ఉవాస ప్రతిమాచంద్రః । ప్రసన్నానామపామివ॥ ౬౭

అథాగ్ర్యమహిషీ రాజ్ఞః । ప్రసూతిసమయే సతీ
పుత్రం తమోపహం లేభే । నక్తం జ్యోతిరి వౌషధిః॥ ౬౮

రామ ఇత్యభిరామేణ । వపుషా తస్య చోదితః
నామధేయం గురుశ్చక్రే । జగత్ప్రథమమంగళం॥ ౬౯

రఘువంశప్రదీపేన । తేనాప్రతిమతేజసా
రక్షాగృహగతా దీపాః । ప్రత్యాదిష్టా ఇవాభవన్॥ ౭౦

శయ్యాగతేన రామేణ । మాతా శాతోదరీ బభౌ
సైకతాంభోజబలినా । జాహ్నవీవ శరత్కృశా॥ ౭౧

కైకేయ్యా స్తనయో జజ్ఞే । భరతో నామ శీలవాన్
జనయిత్రీమలంచక్రే । యః ప్రశ్రయ ఇవ శ్రియం॥ ౭౨

సుతౌ లక్ష్మణశత్రుఘ్నౌ । సుమిత్రా సుషువే యమౌ
సమ్యగాగమితా విద్యా । ప్రబోధవినయావివ॥ ౭౩

నిర్దోషమభవత్సర్వ । మావిష్కృతగుణం జగత్
అన్వగాదివ హి స్వర్గో । గాంగతం పురుషోత్తమం॥ ౭౪

శంఖచక్రగదాఖడ్గ ♦ శార్ఙ్గములను । చిహ్నములఁదాల్చివామనుల్ ♦ చెంతఁజేరి
భద్రముగఁదమ్మునెపుడు గా♦పాడునట్లు । స్వప్నమునఁగాంచిరప్పుణ్య♦సతులుసతులు॥

నింగిబంగారుఱెక్కల ♦ నిగ్గునెఱపి । వేగమునకంబుదమ్ములు ♦ వెంటఁబడఁగ
గరుడుఁడెక్కించుకొనితమ్ము ♦ నరిగినట్లు । స్వప్నమునఁగాంచిరప్పుణ్య ♦ సతులుసతులు॥

విభుఁడుదనయొద్దనిడిన కా♦స్తుభముతనదు । వక్షమునవ్రేలుచుండఁగాఁ ♦ బద్మమనెడు
వీవనునుబట్టిలక్ష్మి సే♦వించినట్లు । స్వప్నమునఁగాంచిరప్పుణ్య ♦ సతులుసతులు॥ ౧౪

అభ్రగంగానదీస్నాన ♦ మాచరించి । వేదపాఠంబుతోవచ్చి ♦ విమలభక్తి
సప్తఋషులనుదమపూజ ♦ సలిపినట్లు । స్వప్నమునఁగాంచిరప్పుణ్య ♦ సతులుసతులు॥

సతులువినిచినవినియట్టి ♦ స్వప్నములకు । ధరణిపాలుఁడుచాలసం ♦ తసముఁబొంది
తానుద్రైలోక్యగురునకుఁ♦దండ్రియగుట । తెలిసియెంతయుశ్రేష్ఠుఁగా ♦ నెంచెఁదన్ను॥

విమలసలిలంబులోపల ♦ విధునిబింబ । మొక్కటయ్యును పెక్కులై ♦ యుండురీతి
నొక్కఁడయ్యునువిభుఁడుదాఁ ♦ బెక్కులైన । భాగములనుండెవారి గ♦ర్భములయందు॥

ప్రసవసమయానదశరథ ♦ ప్రథమమహిషి । శోకమెల్లనుమాపెడు ♦ సుతునిఁబడసెఁ
దమముమాయించుశక్తితోఁ ♦ దనరుచుండు । ప్రభనురాత్రియోషధి ♦ పడయునట్లు॥ ౧౮

పుత్రునిమనోహరంబైన ♦ పోలుపుఁగాంచి । యెంతయునుబ్రేరితుండయి ♦ సంతసమున
జగములకునాదిమంగళ ♦ శబ్దమైన । రామనామంబునిడెఁదండ్రి ♦ రమ్యముగను॥ ౧౯

దివ్యరఘువంశమునకుఁ బ్ర ♦ దీపమగుచు । ననుపమంబగుకాంతిచే ♦ నలరుసతని
ప్రభనుశయ్యాగృహంబు దీ ♦ పంబులెల్లఁ ♦ దెగడఁబడినట్లులుండెను ♦ దీప్తిలేక॥ ౨౦

శిశువురాముఁడుశయ్యపైఁ ♦ జెన్నుమీఱు । సన్నగిలినట్టియుదరంబు ♦ గన్నమాత
యమలసైకతపద్మోప ♦ హారమమరి । సన్నగిలినశరద్గంగ ♦ సరణినొప్పె॥ ౨౧

పుట్టికైకేయికంతఁదాఁ ♦ బుత్రుఁడగుచు । శీలవంతుఁడుభరతాఖ్యఁ ♦ జెలఁగువాఁడు
సిరినివినయంబుగైసేయు ♦ తెఱఁగుదోఁప । లలితగతిఁదల్లిజాతఁ డ ♦ లంకరించె॥ ౨౨

అంతలక్ష్మణశత్రుఘ్ను ♦ లనెడుసుతులఁ । గవలసద్గుణవంతులఁ ♦ గనెసుమిత్ర
చక్కఁగానభ్యసించిన ♦ శాస్త్రమరయు । జ్ఞానవినయంబులనుగాంచు ♦ చందమునను॥

విశ్వవిభుఁడైవెలుఁగునవ ♦ విష్ణువెంట । స్వర్గమేవచ్చినట్టులు ♦ జగతియప్పు
డఖిలదోషవిముక్తయై ♦ యలరుచుండె । నెల్లసద్గుణములఁగాంచి ♦ యెలమినించె॥ ౨౪

తస్యోదయే చతుర్మూర్తేః । పౌలస్త్యచకితేశ్వరాః
విరజస్కైర్నభస్వద్భి । ర్దిశ ఉచ్ఛ్వసితా ఇవ॥ ౭౫

కృశానురపధూమత్వాత్ । ప్రసన్నత్వాత్ప్రభాకరః
రక్షోవిప్రకృతావాస్తా । మపవిద్ధశుచావివ॥ ౭౬

దశాననకిరీటేభ్య । స్తత్క్షణం రాక్షసశ్రియః
మణివ్యాజేన పర్యస్తాః । పృథివ్యామశ్రుబిందవః॥ ౭౭

పుత్రజన్మప్రవేశ్యానాం । తూర్యాణాం తస్య పుత్రిణః
ఆరంభం ప్రథమం చక్రు । ర్దేవదుందుభయో దివి॥ ౭౮

సంతానకమయీ వృష్టి । ర్భవనే చాస్య పేతుషీ
సన్మంగళోపచారాణాం । సైవాదిరచనాభవత్॥ ౭౯

కుమారాః కృతసంస్కారా । స్తే ధాత్రీస్తన్యపాయినః
ఆనందేనాగ్రజేనేవ । సమం వవృధిరే పితుః॥ ౮౦

స్వాభావికం వినీతత్వం । తేషాం వినయకర్మణా
మమూర్ఛ సహజం తేజో । హవిషేవ హవిర్భుజాం॥ ౮౧

పరస్పరావిరుద్ధాస్తే । తద్రఘోరనఘం కులం
అలముద్ద్యోతయామాసు । ర్దేవారణ్యమివర్తవః॥ ౮౨

సమానేఽపి హి సౌభ్రాత్రే । యథోభౌ రామలక్ష్మణౌ
తథా భరతశత్రుఘ్నౌ । ప్రీత్యా ద్వంద్వం బభూవతుః॥ ౮౩

తేషాం ద్వయోర్ద్వయోరైక్యం । బిభిదే న కదాచన
యథా వాయువిభావస్వో । ర్యథా చంద్రసముద్రయోః॥ ౮౪

తే ప్రజానాం ప్రజానాథా । స్తేజసా ప్రశ్రయేణ చ
మనో జహ్రుర్నిదాఘాంతే । శ్యామాభ్రా దివసా ఇవ॥ ౮౫

స చతుర్ధా బభౌ వ్యస్తః । ప్రసవః పృథివీపతేః
ధర్మార్థకామమోక్షాణా । మవతార ఇవాంగభాక్॥ ౮౬

గుణైరారాధయామాసు । స్తే గురుం గురువత్సలాః
తమేవ చతురంతేశం । రత్నైరివ మహార్ణవాః॥ ౮౭

పాదలిహరినాల్గుమూర్తుల ♦ నుదయమంద । ధూళిలేకుండవీచెడు ♦ గాలిచూడ<br>
దశవదనభీతపతియుత ♦ దిశలుభయము । మానివిడిచినయూపిరి ♦ మాడ్కిఁదోఁచె॥ ౨౫

వీతిహోత్రుఁడుపొగవీడి ♦ వెలుఁగుచుండఁ । దరణిసిర్మలకిరణాళిఁ ♦ దనరుచుండఁ<br>
జెడుగురక్కసుచేబాధ ♦ పడినవార । లపుడుదుఃఖివిముక్తులై ♦ నట్లుతోఁచె॥ ౨౬

అత్తఱిదశాస్యమకుటంబు ♦ నందునుండి । రాలిపడుచుండునట్టిర ♦ త్నాళియనెడు<br>
వ్యాజమునరాల్చుచుండెఁ గ్ర♦వ్యాదలక్ష్మి । నేలపైబొటబొటను గ♦న్నీటిబొట్లు॥ ౨౭

పుత్రసంతునిదశరథు ♦ పుత్రిజన్మ । మూపకంబుగఁబొల్చుచు ♦ శుభముదెల్ప<br>
తూర్యములకెల్లనురల దుం♦దుభులెమ్రోయఁ । జెవులకెంతయునింపుగ ♦ దివినిమ్రోసె॥ ౨౮

మానవేంద్రునిసుందర ♦ మందిరమున । సురతరుసుమాళిజలజలఁ ♦ గురిసినృపుని<br>
తనయజన్మోత్సవంబునఁ ♦ దనరుచుండు । నమఃశుభకార్యములకుఁదా ♦ నాదియయ్యె॥ ౨౯

జాతకర్మాదులనుబొంది ♦ జనపసుతులు । దాదులిచ్చెడుచనుబాలు ♦ ద్రావుచుండి<br>
వర్ధిలిరియగ్రజన్ముని ♦ పగిదినొప్పు । జనకహర్షంపుఁబెంపుతో ♦ సమముగాను॥ ౩౦

వారికెంతయుసహజమై ♦ వఱలునట్టి । వినయమభివృద్ధిచెందెను ♦ విద్యచేత<br>
నహ్నికెంతయుసహజమై ♦ నఱలునట్టి । కాంతిహవ్యమ్ముచేవృద్ధిఁ ♦ గాంచునట్లు॥ ౩౧

పరమమైత్రిమెలంగు న♦వ్వారివలన । రాజిలెనఘుంబుగాంచని ♦ రఘుకులమ్ము<br>
నాకవాసులదైనట్టి ♦ నందనమ్ము । చెలఁగుఋతువులవలన రం♦జిల్లునట్లు॥ ౩౨

ఏకసౌభ్రాత్రమునవార ♦ లెసఁగుచున్నఁ । బ్రీతితోఁగూడివెలుఁగెడు ♦ రీతిఁజూడ<br>
జతగనుండిరి రామల♦క్ష్మణులుగలిసి । భరతశత్రుఘ్నులునువారి ♦ వలెఁజరింప॥ ౩౩

అనిలపావకులందుఁ జం♦ద్రార్కులందు । నుండుసఖ్యమునకుభేద ♦ మొదవనట్టు<br>
లాజతలయందునుండు న♦న్యోన్యతకును । గలుగదువిభేదమెన్నఁడే ♦ కరణినైన॥ ౩౪

వేసవికిఁదుదనల్లగా ♦ వేయునట్టి । మబ్బుగల్గినదినమట్లు ♦ మహితమైన<br>
వినయతేజమ్ములనుబ్రజా ♦ విభులుప్రజల । మనములాకర్షణమొనర్చి ♦ తనరిరపుడు॥ ౩౫

నాల్గుభాగమ్ములుగను జె♦న్నారుచుండు । నరవరేంద్రునివిమలసం♦తానమెల్ల<br>
సాంగధర్మార్థకామమో♦క్షావతార । మనఁగనొప్పారెనెంతయు ♦ నద్భుతముగ॥ ౩౬

నలుదెసలనేలునాథుఁడై ♦ యలరుజనకు । సంద్రములునాల్గునరత్న ♦ సమితిచేతఁ<br>
బూజనలిపెడురీతి నఁ♦పూర్ణభక్తి । సుగుణములచేతఁబూజించె ♦ సుతచయంబు॥ ౩౭

సురగజఇవదంతైర్భగ్నదైత్యాసిధారై
ర్నయఇవపణబంధవ్యక్తయోగైరుపాయైః
హరిరివయుగదీర్ఘైర్దోర్భిరంశైస్తదీయైః
పతిరవనిపతీనాంతైశ్చకాశేచతుర్భిః॥ ౮౮

ఇతి శ్రీరఘువంశే మహాకావ్యే కవి శ్రీ కాళిదాసకృతౌ రామావతారోనామ దశమఃసర్గః



సీ॥ రాజులనందఱ ♦ రణమునవోడించి । రాజిల్లుదశరథ ♦ రాజరాజు
దైత్యులఖడ్గాళి ♦ ధారఁబోనడఁచిన । దంతమ్ములొప్పు చౌ♦దంతిమాడ్కి
ఫలసిద్ధినూహింప ♦ వలయును పాయాల । చేతమించెడురాజ ♦ నీతిరీతిఁ
బొడవులైకాడికై ♦ పడిఁగాలిలుబాహువుల్ । గలిగివెల్గెడురమా ♦ కాంతుపగిది॥
భగవదంశమ్ములనుబుట్టి ♦ ప్రబలుచుండు । నిర్మలానందకారులై ♦ నెగడుచుండు
సుగుణవంతులనల్వుర ♦ సుతులఁగూడి । యెంతయును దేజరిల్లె న♦త్యంతమహిమ॥ ౭౭

గద్య.

ఇది శ్రీ పరమేశ్వర కరుణాఫలిత లలితకవితాకలిత శ్రీరామలక్ష్మాంబా బుచ్చి
వేంకయామాత్య తనూజాత సకలసజ్జనవిధేయ ఆదిపూడి సోమనాథ
నామధేయ ప్రణీతంబయిన యాంధ్రరఘువంశంబునందు రా
మావతారమను దశమాశ్వాసము
సంపూర్ణము.





శ్రీ

# రఘువంశమ్



## ఏకాదశః సర్గః

—:o:—

కౌశికేనసకిలక్షితీశ్వరో । రామమధ్వరవిఘాతశాంతయే
కాకపక్షధరమేత్యయాచిత । స్తేజసాంహినవయః సమీక్ష్యతే॥ ౧

కృచ్ఛ్రలబ్ధమపిలబ్ధవర్ణభాక్ । తందిదేశమునయేసలక్ష్మణం
అప్యసుప్రణయినాం రఘోఃకులే । నవ్యహన్యతకదాచిదర్థితా॥ ౨

యావదాదిశతిపార్థివస్తయో । ర్నిర్గమాయపురమార్గసంస్క్రియాం
తావదాశువిదధేమరుత్సఖైః । సాసపుష్పజలవర్షిభిర్ఘనైః॥ ౩

తౌనిదేశకరణోద్యతౌపితు । ర్ధన్వినౌచరణయోర్నిపేతతుః
భూపతేరపితయోఃప్రవత్స్యతో । ర్నమ్రయోరుపరిబాష్పబిందవః॥ ౪

తౌపితుర్నయనజేనవారిణా । కించిదుక్షితశిఖండకావుభౌ
ధన్వినౌతమృషిమన్వగచ్ఛతాం । పౌరదృష్టికృతమార్గతోరణౌ॥ ౫

లక్ష్మణానుచరమేవరాఘవం । నేతుమైచ్ఛదృషిరిత్యసౌనృపః
ఆశిషంప్రయుయుజేనవాహినీం । సాహిరక్షణవిధౌతయోఃక్షమా॥ ౬

మాతృవర్గచరణస్పృశౌమునే । స్తౌప్రపద్యపదవీంమహౌజసః
రేజతుర్గతివశాత్ప్రవర్తినౌ । భాస్కరస్యమధుమాధవావివ॥ ౭

వీచిలోలభుజయోస్తయోర్గతం । శైశవాచ్చపలమప్యశోభత
తోయదాగమఇవోద్ధ్యభిద్యయో । ర్నామధేయసదృశంవిచేష్టితం॥ ౮

తౌబలాతిబలయోః ప్రభావతో । విద్యయోఃపథిమునిప్రదిష్టయోః
మమ్లతుర్నమణికుట్టిమోచితౌ । మాతృపార్శ్వపరివర్తినావివ॥ ౯



శ్రీ

# రఘువంశము.

## ఏకాదశాశ్వాసము.

:0:

### గీతములు.

కౌశికుం డొక్క నాఁడు భూ ♦ కాంతుఁ జేరి । కాకపక్షము దాలిచి ♦ క్రాలు రాము
యజ్ఞవిఘ్నంబుఁ బాపఁగా ♦ నంపఁ గోరెఁ । బ్రాయ మెంచరుఁగా శౌర్య ♦ వంతులందు॥

బుధుల సేవించు నా రాజ ♦ పుంగవుండు । కష్టమునఁ గన్న రాము ల ♦ క్ష్మణునితోడఁ
బనిచె ముని వెంటఁ గోరినఁ ♦ బ్రాణమైన । నియ్యకుందురె రఘువంశ ♦ నృపతు లెపుడు॥

వార లరుగఁగఁ బురరాజ ♦ పథము నెల్ల । నృపుఁడు గైసేయ నానతి ♦ యిడినతోనె
వాయువును మిత్రుఁ గాఁ గొని ♦ వారిదములు । పుష్పజలవృష్టి విభు నాజ్ఞఁ ♦ బూర్తిసేసె॥

చాపములఁ దాల్చి పితృనాజ్ఞ ♦ సలుపనున్న । వారు వ్రాలిరి యాతని ♦ పాదములను
భూపతియు నట్లు నమ్రులై ♦ మ్రొక్కి యున్న । సుతులపై బాష్పబిందుల ♦ వితతి రాల్చె॥

తండ్రికన్నీటఁ గూకటుల్ ♦ దడిసినట్టి । చాపములఁ దాల్చినట్టి యా ♦ జనపసుతులు
పౌరదృక్పాళి పురమార్గ ♦ తోరణాళి । గాఁగ నా ఋషి వెంటను ♦ గదలి రపుడు॥ ౫

వెంటఁ గొని చన సౌమిత్రి ♦ వెంటనుండు । రాము నేకోరె ఋషి గాన ♦ రాజమౌళి
యిడెను దీవెన సేనల ♦ నిడక వెంట । నదియె చాలును రక్షింప ♦ నంచు నెంచి॥ ౬

మాతల పదాబ్జముల నంటి ♦ మౌనివరుని । చండతేజు నిపథమునఁ ♦ జనెడువారు
మించి రవిగతిఁ బట్టి వ ♦ ర్తించు మండు । దివ్యమధుమాధవములట్లు ♦ తేజరిలిరి॥ ౭

ఉద్ధ్యభిద్యాఖ్యనదముల ♦ నొప్పునట్టి । వర్షకాలపుఁ జేష్టకుఁ ♦ బాటియగుచుఁ
దరఁగలట్టులు చంచల ♦ తరములైన । బాహువుల చాపలం బొప్పె ♦ బాల్యమగుట॥ ౮

బలయు నతిబలయను విద్య ♦ లెలమితోడ । మౌని యొసఁగినఁ ద్రోవఁ ద ♦ న్మంత్రమహిమ
రమణీస్థలి విహరించు ♦ బాలురయ్యుఁ । బడలకుండిరి తమతల్లి ♦ కడను బోలె॥ ౯

పూర్వవృత్తకథితైఃపురావిదః । సానుజఃపితృసఖస్యరాఘవః
ఉహ్యమానఇవవాహనోచితః । పాదచారమపినవ్యభావయత్ ॥ ౧౦

తౌసరాంసిరసవద్భిరమ్బుభిః । కూజితైశ్శ్రుతిసుఖైఃపతత్త్రిణః
వాయవఃసురభిపుష్పరేణుభి । శ్ఛాయయాచజలదాఃసిషేవిరే॥ ౧౧

నాంభసాంకమలశోభినాంతథా । శాఖినాంనచపరిశ్రమచ్ఛిదాం
దర్శనేనలఘునాయథాతయోః । ప్రీతిమాపురుభయోస్తపస్వినః॥ ౧౨

స్థాణుదగ్ధవపుషస్తపోవనం । ప్రాప్యదాశరథిరాత్తకార్ముకః
విగ్రహేణమదనస్యచారుణా । సోభవత్ప్రతినిధిర్నకర్మణా॥ ౧౩

తౌసుకేతుసుతయాఖిలీకృతే । కౌశికాద్విదితశాపయాపథి
నిన్యతుఃస్థలనివేశితాటనీ । లీలయైవధనుషీఅధిజ్యతాం॥ ౧౪

జ్యానినాదమథగృహ్ణతీతయోః । ప్రాదురాసబహులక్షపాచ్ఛవిః
తాటకాచలకపాలకుండలా । కాలికేవనిబిడాబలాకినీ॥ ౧౫

తీవ్రవేగధుతమార్గవృక్షయా । ప్రేతచీవరవసాస్వనోగ్రయా
అభ్యభావిభరతాగ్రజన్మయా । వాత్యయేవపితృకాననోత్థయా॥ ౧౬

ఉద్యతైకభుజయష్టిమాయతీం । శ్రోణిలంబిపురుషాంత్రమేఖలాం
తాంవిలోక్యవనితావధేఘృణాం । పత్త్రిణాసహముమోచరాఘవః॥ ౧౭

యచ్చకారవివరంశిలాఘనే । తాటకోరసిసరామసాయకః
అప్రవిష్టవిషయస్యరక్షసాం । ద్వారతామగమదంతకస్యతత్ ॥ ౧౮

బాణభిన్నహృదయానిపేతుషీ । సాస్వకాననభువంనకేవలాం
విష్టపత్రయపరాజయస్థిరాం । రావణశ్రియమపివ్యకంపయత్ ॥ ౧౯

రామమన్మథశరేణతాడితా । దుస్సహేనహృదయేనిశాచరీ
గంధవద్రుధిరచందనోక్షితా । జీవితేశవసతింజగామసా॥ ౨౦

నైరృతఘ్నమథమంత్రవన్మునేః । ప్రాపదస్త్రమవదానతోషితాత్
జ్యోతిరింధననిపాతిభాస్కరాత్ । సూర్యకాంతఇవతాటకాంతకః॥ ౨౧

వామనాశ్రమపదంతతఃపరం । పావనంశ్రుతమృషేరుపేయివాన్
ఉన్మనాఃప్రథమజన్మచేష్టితాన్ । అస్మరన్నపిబభూవరాఘవః॥ ౨౨

వాహనంబుల కలవాటు ♦ పడినరాముఁ । డనుజునింగూడి కాల్నడ ♦ నరుగుచున్నఁ
జిత్రసఖుఁడు పూర్వచారిత్రి ♦ విదుఁడు దెలుపు । కథల నాయాసమెఱుఁగక ♦ పథమునడచె॥

రుచిరుచిరవారిచేత స ♦ రోవరములు । హారికూజితములచే వి ♦ హంగమములు
సౌరభలతాంతరజముచే ♦ మారుతములు । నీడచే మేఘములు గొల్చె ♦ నృపతిసుతుల॥

జలజముల నొప్పు జలముల ♦ వలనఁగాని । బడలికను దీర్చు తరువుల ♦ వలనఁగాని
తాపసులు వారిదర్శనో ♦ త్సవమువలన । గన్న సంప్రీతి నెప్పుడుఁ ♦ గాంచలేదు॥ ౧౩

హరనయనదగ్ధ మదనుని ♦ యాశ్రిమంబు । చేత ధనువున్న రాముఁడు ♦ సేరియచటఁ
గార్యములఁగాక సుందర ♦ కాయమునను । మరుని ప్రతినిధియో యన ♦ మఱలెనంత॥

ప్రీతి ముని తెల్పినట్టి సు ♦ కేతుతనయ । శాపహతచేరి చెఱచిన ♦ యాపథమున
మోపి కోటుల నిలమీఁదఁ ♦ జాపయుగము । నెక్కువెట్టిరి లీల నృ ♦ పేంద్రసుతులు॥

వీనులను బుస్కుపోగులు ♦ వ్రేలుచుండ । బహుళరాత్రిని బోలెడు ♦ వన్నెగల్గి
బకచయముతోడి మేఘాళి ♦ భాతిఁదోఁచె । నెదుటఁదాటక వారిటం ♦ కృతి గ్రహించి॥

వేగభరమున వృక్షముల్ ♦ విఱిగిపడఁగఁ । బీనుఁగుల మీఁది పేలికల్ ♦ మేనఁదాల్చి
ప్రేతభూమిని లేచెడు ♦ వాతమట్లు । లార్చుచును వచ్చి రాము నె ♦ దిర్చెనసుర॥ ౧౭

కట్టువలె నెత్తియున్నట్టి ♦ కరముదాని । వ్రేలుప్రేవుల మొలనూలు ♦ గ్రాలుదానిఁ
గాంచి రాముఁడు విడిచెను ♦ గఱకుటమ్ము । తోడ స్త్రీవధఁ గలదయుఁ ♦ గూడనపుడు॥

రాతిఁబోలిన తాటకో ♦ రస్థలమున । రాముబాణంబు సల్పిన ♦ రంధ్రిమరయ
నింతవఱకును రాక్షస ♦ ప్రాంతమందుఁ । జొరనియమునకు ద్వారంబు ♦ కరణినొప్పె॥

శరదళిత వక్ష యివ్విధి ♦ ధరణిఁబడిన । దానికానన భూమిమా ♦ త్రమ్మెగాక
త్రిజగముల గెల్చి తిరమయి ♦ తేజరిలిన । పదితలలవాని సిరియుఁ గం ♦ పంబునొందె॥

ఆ నిశాచరి సహియింప ♦ రానిరామ । కామశరమున హృదయంబు ♦ ఘాతమొంద
గంధయుత రక్తచందన ♦ గంధమలఁది । జీవితేశు నివాసంబుఁ ♦ జేరసరిగె॥ ౨౦

కడఁక మెచ్చినమునినుండి ♦ పడసి రాముఁ । డసురలనుజంపుమంత్రియు ♦ తాస్త్ర మపుడు
సూర్యకాంతపు శిల తాను ♦ సూర్యునుండి । కాష్ఠములఁ గాల్చు కాంతిని ♦ గాంచునట్లు॥

అంత ఋషిచేత వినియుండి ♦ యమలమైన । భవ్యతరవామ నాశ్రమ ♦ పదముఁజేరి
పూర్వజన్మస్మరణముఁజెం ♦ దొందకున్న । నెంతయును రాముఁడుత్సాహ ♦ వంతుఁడయ్యె॥

ఆససాద మునిరాత్మనస్తతః । శిష్యవర్గపరికల్పితార్హణం
బద్ధపల్లవపుటాంజలిద్రుమం । దర్శనోన్ముఖమృగం తపోవనం ॥ ౨౩

తత్ర దీక్షితమృషిం రరక్షతు ర్విఘ్నతో దశరథాత్మజౌ శరైః
లోకమంధతమసాత్క్రమోదితౌ । రశ్మిభిః శశిదివాకరావివ ॥ ౨౪

వీక్ష్య వేదిమథ రక్తబిందుభి । ర్బంధుజీవపృథుభిః ప్రదూషితాం
సంభ్రమోఽభవదపోఢకర్మణా । మృత్విజాం చ్యుతవికంకతస్రుచాం ॥ ౨౫

ఉన్ముఖః సపది లక్ష్మణాగ్రజో । బాణమాశ్రయముఖాత్సముద్ధరన్
రక్షసాం బలమపశ్యదంబరే । గృధ్రపక్షపవనేరితధ్వజం ॥ ౨౬

తత్ర యావధిపతీ మఖద్విషాం । తౌ శరవ్యమకరోత్స నేతరాం
కిం మహోరగవిసర్పివిక్రమో । రాజిలేషు గరుడః ప్రవర్తతే ॥ ౨౭

సోఽస్త్రముగ్రజవమస్త్రకోవిదః । సందధే ధనుషి వాయుదైవతం
తేన శైలగురుమప్యపాతయత్ । పాండుపత్రమివ తాటకాసుతం ॥ ౨౮

యః సుబాహురితి రాక్షసోఽపర । స్తత్ర తత్ర విససర్ప మాయయా
తం క్షురప్రశకలీకృతం కృతీ । పత్రిణాం వ్యభజదాశ్రమాద్బహిః ॥ ౨౯

ఇత్యపాస్తమఖవిఘ్నయోస్తయోః । సాంయుగీనమభినంద్య విక్రమం
ఋత్విజః కులపతేర్యథాక్రమం । వాగ్యతస్య నిరవర్తయన్క్రియాః ॥ ౩౦

తౌ ప్రణామచలకాకపక్షకౌ । భ్రాతరావవభృథాప్లుతో మునిః
ఆశిషామనుపదం సమస్పృశ । ద్దర్భపాటితతలేన పాణినా ॥ ౩౧

తం న్యమంత్రయత సంభృతక్రతు । ర్మైథిలః స మిథిలాం వ్రజన్వశీ
రాఘవావపి నినాయ బిభ్రతౌ । తద్ధనుఃశ్రవణజం కుతూహలం ॥ ౩౨

తైః శివేషు వసతిర్గతాధ్వభిః । సాయమాశ్రమతరుష్వగృహ్యత
యేషు దీర్ఘతపసః పరిగ్రహో । వాసవక్షణకలత్రతాం యయౌ ॥ ౩౩

ప్రత్యపద్యత చిరాయ యత్పున । శ్చారుగౌతమవధూః శిలామయీ
స్వం వపుః స కిల కిల్బిషచ్ఛిదాం । రామపాదరజసామనుగ్రహః ॥ ౩౪

రాఘవాన్వితముపస్థితం మునిం । తం నిశమ్య జనకో జనేశ్వరః
అర్థకామసహితం సపర్యయా । దేహబద్ధమివ ధర్మమభ్యగాత్ ॥ ౩౫

అర్భకయి శిష్యలిడిన పు ♦ ష్పాదికములఁ । బల్లవాంజలిఁ గూర్చిన ♦ పాదపములఁ
జూడ మోముల నెత్తిన ♦ లేడిగములఁ । దనరు తనయాశ్రమముఁజేరె ♦ మునివరుండు॥

దశరథాత్మజులట దీక్షఁ ♦ దనరు ఋషిని । విఘ్నములనుండి కాచిరి ♦ విశిఖములను
గ్రమముగాఁ దోఁచి శశిరవుల్ ♦ దమమునుండి । కిరణముల చేతజగముర ♦ క్షించుమాడ్కి॥

వేదిమంకెన పూలంత ♦ పెద్దదైన । నెత్తుర్బొట్టులచే నప ♦ విత్రమైనఁ
జూచియట్టె వికంకత ♦ సుస్రుక్కులెడలి । స్వక్రియలు మాని ఋత్విజుల్ ♦ భయముపడిరి॥

అపుడు రాముఁడు పొదినుండి ♦ యాశుగంబు । దీనిమోమెత్తి దివికిఁదా ♦ దృష్టిఁజఱపి
గ్రద్దలాడించు తెక్కల ♦ గాలిఁగదలు । పడగలను గల్గు దనుజుల ♦ దపముఁగాంచె॥

యజ్ఞరిపులగు వారిలో ♦ నధిపులైన । వారిగుఱిపెట్టె రాముండు ♦ వదలిపరుల
ఘనభుజంగాళి కడరెడు ♦ గరుడుఁడెందు । నీటిపాముల మీఁదికి ♦ ధాటియిడునె॥

అస్త్రకోవిదుఁడగురాముఁ ♦ డమిత జవము । గలుగునని లాస్త్రమునుగూర్చెఁ ♦ గార్ముకమున
దానిచేఁ గొండబరువుఁడు ♦ తాటకేయుఁ । డవనిమీఁదను బడెఁ బండు ♦ టాకువోలె॥

అంతట సుబాహు వనియెడు ♦ నన్యదనుజుఁ । డేరిమాయల నటునిటుఁ ♦ దిరుగువాని
రాముఁడే దైఱఁ జెక్కెత్తు ♦ రపృమునను । వనికి నవల ఖగాళికిఁ ♦ బంచిపెట్టె॥ ౩౩

కులపతియును మానియైనట్టి ♦ కుశికపుత్రు । యజ్ఞ విఘ్నముఁబాపి య ♦ థార్థాభిధని
గ్రతువు నెఱవేరఁ జేసిన ♦ రాజసుతుల । యాజితేజంబుఁ గొనియాడె ♦ యాజకాళి॥

కదలఁగాఁ గాక పక్షముల్ ♦ కాళ్లకెఱఁగు । నన్నదమ్ముల దీవించి ♦ హర్షమునను
దర్భనొఱసిన యఱచేతఁ ♦ దనువులంటె । నవభృథస్నాన మొనరించి ♦ యలరుమాళి॥

యజ్ఞమొనరింప సంసిద్ధుఁ ♦ డైనజనకు । ప్రార్థనంబున మిథిలకు ♦ నరుగుమౌని
తాము విన్నట్టి జనకుని ♦ ధనువుఁజూడ । వేడ్కపడు రాఘవులఁగూడ ♦ వెంటఁగొనియె॥

నడచి మార్గంబు సాయంత ♦ నమునవారు । వరతపోధను గౌతము ♦ పత్నిశూన్య
శకుని కళత్రమైన యా ♦ శ్రమమునందుఁ । దరులక్రింద వసించిరి ♦ కరముఁ బ్రీతి॥

ఎంతయో కాలముగ శిలా ♦ కృతినినున్న । గౌతమునిభార్య మరల సం ♦ ప్రీతి మెఱయ
నఘహరంబగు రాముపా ♦ దారవింద । రజముచేఁ గాంచెనటఁ దన ♦ రమ్యతనువు॥ ౩౮

మౌని యరుదెంచె రాముల ♦ తమ్మణులతోడ । ననఁగ వినిచనె నెదురుగ ♦ జనకనృపతి
సర్థకాను సమేత ధ ♦ ర్మాత్మవతార । మనఁగ నొప్పెడు ఋత్వికీన ♦ ర్యామ్యగొనుచు॥

తౌవిదేహనగరీనివాసినాం । గాంగతావివదివఃపునర్వసూ
మన్యతేస్మపిబతాంవిలోచనైః । పక్ష్మపాతమపివంచనాంమనః॥ ౩౬

యూపవత్యవసితేక్రియావిధౌ । కాలవిత్కుశికవంశవర్ధనః
రామమిష్వసనదర్శనోత్సుకం । మైథిలాయకథయాంబభూవసః॥ ౩౭

తస్యవీక్ష్యలలితంవపుఃశిశోః । పార్థివఃప్రథితవంశజన్మనః
స్వంవిచింత్యచధనుర్దురానమం । పీడితోదుహితృశుల్కసంస్థయా॥ ౩౮

అబ్రవీచ్చభగవన్ మతంగజై । ర్యద్బృహద్భిరపికర్మదుష్కరం
తత్రనాహమనుమంతుముత్సహే । మోఘవృత్తికలభస్యచేష్టితం॥ ౩౯

హ్రేపితాహిబహవోనరేశ్వరా । స్తేనతాతధనుషాధనుర్భృతః
జ్యానిఘాతకఠినత్వచోభుజాన్ । స్వాన్విధూయధిగితిప్రతస్థిరే॥ ౪౦

ప్రత్యువాచతమృషిర్నిశమ్యతాం । సారతోయమథవాకృతంగిరా
చాపఏవభవతోభవిష్యతి । వ్యక్తశక్తిరశనిర్గిరావివ॥ ౪౧

ఏవమాప్తవచనాత్సపౌరుషం । కాకపక్షకధరేపిరాఘవే
శ్రద్దధేత్రిదశగోపమాత్రకే । దాహశక్తిమివకృష్ణవర్త్మని॥ ౪౨

వ్యాదిదేశగణశోథపార్శ్వగాన్ । కార్ముకాభిహరణాయమైథిలః
తైజసస్యధనుషఃప్రవృత్తయే । తోయదానివసహస్రలోచనః॥ ౪౩

తత్ప్రసుప్తభుజగేంద్రభీషణం । వీక్ష్యదాశరథిరాదదేధనుః
విద్రుతక్రతుమృగానుసారిణం । యేనబాణమసృజద్వృషధ్వజః॥ ౪౪

ఆతతజ్యమకరోత్ససంసదా । విస్మయస్తిమితనేత్రమీక్షితః
శైలసారమపినాతియత్నతః । పుష్పచాపమివపేశలంస్మరః॥ ౪౫

భజ్యమానమతిమాత్రకర్షణాత్ । తేనవజ్రపరుషస్వనంధనుః
భార్గవాయదృఢమన్యవేపునః । క్షత్రముద్యతమివన్యవేదయత్॥ ౪౬

దృష్టసారమథరుద్రకార్ముకే । వీర్యశుల్కమభినంద్యమైథిలః
రాఘవాయతనయామయోనిజాం । పార్థివఃశ్రియమివన్యవేదయత్॥ ౪౭

మైథిలఃసపదిసత్యసంగరో । రాఘవాయతనయామయోనిజాం
సన్నిధౌద్యుతిమతస్తపోనిధే । రగ్నిసాక్షికఇవాతిసృష్టవాన్॥ ౪౮

అవ్వి దేహులు దివినుండి ♦ యవనిదిగిన । యప్సరస్సులను బోలి ♦ యలరుచుండు
రాఘవుల రూపులను గంటఁ ♦ దారివిరపుడు । వంచకములని తమ కెప్ప ♦ పాటల్ల నెంచి॥
యూపవతియయి క్రతువంత ♦ మొందఁగాంచి । సమయవిదుఁడైనకుశికవం♦శప్రసూతి
కార్ముకముచూడ రాముని ♦ కౌతుకంబు । నెఱుఁగఁ జేసెను జనక నృ ♦ ధ్వీశునకును॥
ఖ్యాత వంశమ్ములోఁ బుట్టి ♦ కాలిరు నృపతి । తనయునిమనోహరంబైన♦తనువుఁజూచి
పంచ దుస్సాధ్య మైన చా♦ పముదలంచి। పుత్రియుంకువ కెంతయుఁ ♦ బొక్కె విభుఁడు॥
గంధ సింధురమునకును ♦ గష్టమైన । పనుల బాలగజంబుదా ♦ వ్యర్థముగను
గడఁగుటకు నేను సమ్మతి ♦ నిడఁగలేను । వినుఁడు మానీంద్ర యని యోఁడు♦విన్నవించె॥
ఎందఱో చాపధరులగు ♦ నృపులువచ్చి । భంగపడి దీనిచే గుణ ♦ ప్రతినిఘాత
పటల కఠినతరాత్మీయ ♦ బాహుబలముఁ । దెగడికొం చేగి రనియును ♦ దెలిపె నతఁడు॥
అనుఁడు మునిపల్కె వినుమీతఁ ♦ డమితబలుఁడు । పలుకులేటికి నీచాప ♦ బలమునెల్లఁ
బట్టి పరికించుఁ దనబాహు ♦ బలముచేత । మించి పిడుగ ద్రుులను బరీ ♦ క్షించునట్లు॥
అవనిమిణుఁగురు పురుగంత ♦ యగ్ని యందు । దాహశక్తి యనంతమై ♦ తనరుకరణి
నమితమా తేజమబ్బాలు ♦ నందునుండు । ననుమనృపుఁ డెంచె నాప్తుఁడౌ ♦ మునిరచింప॥
అనుచరుల గుంపు గుంపుగ ♦ నంపెనపుడు । తనదు బాణాసనము దేఁగ ♦ జనకనృపతి
వేయికన్నులు గలవాఁడు ♦ తోయదముల । మించు విలుదెచ్చుపనికయి ♦ పంచునట్లు॥
సుప్త ఫణిపతి గతిభీతిఁ ♦ జూపునట్టి । వీడి క్రతువును బాలెడు ♦ వేడులకును
దివ్యశరమును హరుఁడు సం ♦ ధించినట్టి । చాపమీక్షించి చేపట్టె ♦ భూపుపట్టి॥ ౪౪
రెప్పవేయక నిర్వ్యాజ ♦ నృపకుమారు । సభ్యులందఱు వీక్షింప ♦ సరసగతిని
గొండబరువుండు ధనువున ♦ గుణముఁగూర్చె । వేడ్కవిరివింట మరుఁడెక్కు♦వెట్టునట్లు॥
రాముఁడెక్కువగా నీడ్వ ♦ వ్రక్కలగుచు । నుఱుమినట్టులు ధ్వనిచేసె ♦ హరునిధనువు
బద్ధవైరంబు పూనిన ♦ భార్గవునకు । క్షత్రమిదె పుట్టె మఱియని ♦ చాటుకరణి॥ ౪౫
భవుని ధనువున రాముని ♦ బలముఁజూచి । శౌర్యశుల్కముఁ గొనియాడి ♦ జనకనృపతి
యతని కిచ్చెదనని తెల్పె ♦ సుతనుహితను । రమకుఁదుల్యను సీతను ♦ రమ్యగుణను॥ ౪౬॥
తనదుపుత్రినయోనిజఁ ♦ దత్క్షణంబ । సత్యసంధుఁడుజనకుఁడు ♦ శౌర్యనిధికి
రామచంద్రునకత్తపో ♦ ధాము నెదుట । నగ్నియెదుటనువలెనిచ్చె ♦ హర్షమతిని॥ ౪౭

